5-3-1993 [illegible] 12 [illegible] : 64 [illegible] 6 [illegible] : రు. 2.00

Regd. No. H.N.L. 18

# జమీన్‌రైతు

స్థాపకుడు : నెల్లూరు వెంకటరామానాయుడు

## 'ఐఎఎస్' పరువే పోయింది!

# బాబు, మింజులతో రాజీపడ్డాడా?

రాష్ట్ర సీనియర్ ఐఎఎస్ అధికారి, జనార్దన రెడ్డి ముఖ్యమంత్రిత్వ హయాంలో సెక్రటేరియట్ సామ్రాట్‌గా వెలుగొందిన వివాదాస్పదుడు శ్రీ హెచ్.కె. బాబు ఇప్పుడు మరొక వివాదంలో చిక్కుకున్నారు. ఒక తెలుగు దేశం ఎమ్మెల్యే కుమారుడు తనను ప్రేమించి, పెళ్లి చేసుకోకుండా వంచించాడని ఆందోళన చేసి, రచ్చకెక్కిన ఫైర్ బ్రాండ్ యువతి మింజాలా చౌదరి ఇప్పుడు తాజాగా హెచ్.కె. బాబు తనను మూడవ భార్యగా పెళ్లాడి, వాడుకున్న తర్వాత బయటకు తోసేశారని పోలీసు కేసుపెట్టి గందరగోళం సృష్టించింది.

హెచ్.కె. బాబుకు ఇప్పటికే ఇద్దరు భార్యలున్నారు. మొదటి భార్య హిందూ స్త్రీ; రెండవ పెళ్లి సమయంలో బహుభార్యాత్వం నిబంధన తప్పించు కోవడానికి ముస్లిం మతం స్వీకరించినట్లు ప్రకటించి ఆమెను ఇంటికి తెచ్చారు. వీరు కాక మింజాలా చౌదరిని మూడవ పెళ్లి చేసుకున్నారట. తర్వాత ఏమి జరిగిందో ఏమో, ఆమె ఆయన పై తానూ ఒక కేసు పెట్టింది. ఈ గొడవ బయటపడిన తర్వాత హెచ్.కె. బాబు ఆమె పై మరొక కేసు దాఖలు చేసి, తన రివాల్వర్‌ను ఎత్తుక వెళ్లిందని ఫిర్యాదు చేశారు. తీరా విచారిస్తే ఆ రివాల్వర్ ఆయన ఇంటిబయట చెట్లలోనే వుందింది. అసెంబ్లీ సమావేశం జరిగే సమయంలో మింజాలా చౌదరి రచ్చ ప్రారంభించడంతో ప్రతిపక్షాలు ప్రభుత్వాన్ని విలదీశాయి. హెచ్.కె. బాబును సస్పెండ్ చేయాలని

కొరవ 7 పేజీలో

# పెద్దాస్పత్రిలో డాక్టర్ల కుస్తీ!

నెల్లూరు పెద్దాస్పత్రి డాక్టర్లు వీధికెక్కారు. లోలోపల కుస్తీ పట్లు పట్టుకుంటున్న వారు కాస్త బజారులో జుట్టు పట్టుకునే పరిస్థితికి చేరుకున్నారు. ఆస్పత్రి సూపరింటెండెంట్ డాక్టర్ పి. రామిరెడ్డి, తనతోటి డాక్టరు, తనంతటి సీనియరు అయిన డాక్టరు వై. ఈశ్వర రెడ్డి పై చీటింగ్ కేసు పెట్టి, అరెస్టు చేయమని పోలీస్ స్టేషన్ చుట్టూ తిరుగుతున్నారట. ఇది నూటికి నూరుపాళ్లు తప్పుడు కేసు. ఎస్. వెంకయ్య అనే హెడ్ కానిస్టేబిల్ 92 వ నెలలో కాలులో చీల గుచ్చుకుని పెద్దాస్పత్రిలో చేరాడు. అతడికి సకాలంలో సరైన మందు ఇవ్వక కాలు కుళ్లి పోయి తీసి వేయవలసి వచ్చింది. దానితో ఉద్యోగం పోయింది. అటువంటి దీన స్థితిలో ఆ అభాగ్యుడు తను ఖర్చు పెట్టి తెచ్చుకున్న మందుల బిల్లులు ఆస్పత్రికి సబ్‌మిట్ చేసి, రీ ఇంబర్స్‌మెంట్‌కు సర్టిఫికెట్ ఇవ్వమని కోరాడట. బిల్లులలో కొన్ని లోపాలుండడంతో డాక్టర్ వై. ఈశ్వర రెడ్డి వాటిని సూపరింటెండెంట్‌కు పంపారు. ఆయన కానిస్టేబిల్‌ను త్రిప్పగలిగినన్ని రోజులు త్రిప్పుకుని వట్టి చేయి చూపించారు. కడుపు మండిన ఆ కానిస్టేబిల్ కలెక్టరుకు ఫిర్యాదు చేశాడు. అప్పుడు కలదెలుసుకున్న సూపరింటెండెంట్ గారు నేరం తన మీదకు ఎక్కడకు వస్తుందోనని భయపడి —డాక్టర్ ఈశ్వర రెడ్డి కానిస్టేబిల్ కలసి దొంగ బిల్లులు తయారు చేశారని, ఈశ్వర రెడ్డి స్వంతానికి వాడిన మందుల కోసం మోసం చేయబోయాడని కేసు పెట్టాడట. జనవరి 6 తేది కానిస్టేబిల్‌కు బిల్లులు తిప్పి పంపిన సూపర్నెంటు, ఫిబ్రవరి 1 తేది వాటిలో తప్పు కనిపెట్టి కేసుపెట్టడం విచిత్రం. అందునా తోటి డాక్టరు పై కేసు పెట్టేటప్పుడు పాటించాల్సిన కనీస నియమాలనూ ఆయన పట్టించు కోలేదు. కేవలం వ్యక్తిగత కక్షతో తొందర పడినట్లుంది. ఆస్పత్రి అధ్వాన్న పరిస్థితికిది అద్దం పడుతున్నది.

> సూపర్నెంటే ముఠా నాయకుడై పరిపాలన భ్రష్టు పెట్టించేశాడు — పోలీసు కేసుల వరకు వెళ్లింది వీరి కీచులాట!

సూపరింటెండెంట్ గారి పై సవాలక్ష ఆరోపణలున్నాయి. ఆయన పరిపాలన సరసం దర్శించదని పేరు. ఆస్పత్రిలో మందులుండవు — బెడ్ల పై దుప్పట్లుండవు— బాత్ రూములు కడగడానికి ఫినాయిలుండదు— ఆపరేషన్ థియేటర్‌లో లైట్లువెలగవు — పేషంట్లు పట్టి పుణ్యానికి చస్తున్నా పట్టించుకునే వారు లేరు. పాపం కల్గుతుందని, ఉసురు తగులుతుందని పెద్ద వాళ్లు చెప్పే మాటలు నిజమే అయితే పెద్దాస్పత్రిలోని ప్రతి డాక్టరుకూ ఈ పాటికి యమలోకంలో కాగే నూనె బాండల్లు, ఉడికే సున్నం బానలు రెడీగా వుండి వుండాలి. రోగులు చావడం తప్ప, వారు మాత్రం మిద్దెలు మేడలు కట్టుకుంటూ కులాసాగానే వున్నారు. కేవలం డాక్టర్ల నిర్లక్ష్యం, ఆస్పత్రిలో మందు మాకుల కరువు వల్ల ఎన్ని ప్రాణాలు గడతేరి పోయాయో వూహించలేము.

ఆస్పత్రిలోని ఎంఎస్ఎ వార్డులో సిరంజిలు ఉడక బెట్టే స్టెరిలైజరు చెడిపోయి నెలైందట. ఈ ఇంజక్షను వాడితే పేషంట్లు ఏమైపోవాలి? గిన్నెలు కడిగే యాంటిసెప్టిక్ సొల్యూషన్ అయిపోయి మూడు నెలలైంది. గాయాలు పుచ్చిపోతున్నా దిక్కులేదు. ఒళ్లు కాలి వచ్చే రోగుల గదిలో ఎయిర్ కండిషనర్ చెడి ఏడాదైంది. మంటతో వారు అల్లాడుతుంటే సూపర్నెంట్ గారికి ఆనందంగా వుంది. తను చూడవలసిన ప్రత్యేక, ప్రమాదకర కేసులకూ జూనియర్ డాక్టర్లను పంపి, తాను మాత్రం ఇంట్లో ప్రైవేటు ప్రాక్టీసు చేసుకుంటున్నాడట. నిర్లక్ష్యం వల్ల చనిపోయే రోగుల బంధువులు తిట్టే, ప్రక్క డాక్టర్ పై నెపం పెట్టి తప్పించు కుంటున్నాడట. ఎప్పుడూ మధ్యాహ్నం పైన ఆస్పత్రికి రానే రారు— పేషంట్ చస్తున్నాడని తెలిసినా చలించక పోవడం వారి మనో నిబ్బర వైశిష్ట్యమట. ఒకేసారి రెండు లక్షల 62 వేల రూపాయల మందులు అమ్మేశారని ఆరోపణ వచ్చి, అవి ప్రైవేటు క్లినిక్‌లో పట్టుబడినా ఆయన్ను కదలించే సాహసం ఎవరికీ కలగడం లేదు. ఆ విచారణ ఏమైందో కూడా ఎవరికీ తెలియదు. పై అధికారులకు ఫిర్యాదులు

కొరవ 7 పేజీలో

# పినాకి తీరం

## ఆధారమేమైనా వుందా?

శ్రీనివాసులు రెడ్డి పోయారు! తన తదనంతర రాజకీయ పర్యాట్లను గూర్చి చెప్పే తడువు లేకుండా వెళ్లిపోయారు. తాను జీవించనని తెలిసి వుంటే, మాట్లాడ గలిగి వుంటే, చెప్పి వ్రాయించి చేసాలు పెట్టే వ్యవధి వుండి వుంటే, ఆయన రాజకీయ వీలునామా ఏ విధంగా వుండి వుండేదో వూహించలేము.

ఆయన మరణానంతరం జిల్లాలో ఒక వదంతి గాలిలో ప్రసార మవుతున్నది. కాంగ్రెస్‌లో రెండవ గ్రూపు ఒకటి కొత్తగా ఆవిర్భవించ వచ్చుననేది ఆ వదంతి సారాంశం. దానికి ఎవరు అధ్యులు, అందులో ఎవరెవరు చేరుతారు, ఏ ప్రయోజనం కోసం ఈ ప్రయత్నం, ఆ గ్రూప్పు అవసరమేమిటి అనే ప్రశ్నలకు సమాధానం దొరకడం లేదు. ఏదో వూహాగానంతో ఎవరో గాలిలోకి వదిలినట్లున్నారు గాని ఈ వదంతికి ఈ క్షణం వరకు ఆధారమే దొరకడం లేదు.

జనార్దనరెడ్డి అనుయాయుల్లో, అభిమానుల్లో అసంతృప్తి, ఆయన పట్ల విముఖత వున్నాయి. నివురుగప్పిన నిప్పులా బయట పడకుండా వున్న ఆ వ్యతిరేకతను సమీకరించి, సంఘటిత పరచి ఒక రూపం ఏర్పరిస్తే దావంతటదే పెద్దదై పోతుంది అనే అంచనాలతో ఆయనతో అంతరంగికంగా విభేదిస్తున్నారనుకునే వారెవరైనా ఒక 'ఫీలర్' జనంలోకి వదిలారా అనిపిస్తుంది. రెండవ గ్రూపు ఏర్పాటుకు అదే అదను అని అనుకున్నారా అనిపిస్తుంది. కాని పిల్లి మెడకు గంట గట్టే వారెవరు? బయటపడి అంత పని చేసేంత బలం, సాహసం ఎవరికున్నాయి?

అటువంటి ప్రయత్నానికి దోహదకారులు కాగలరని వారి పేర్లు వినబడేటి పోవడం లేదు. అందులో చాలా మంది ముఖ్యులున్నారు - జిల్లా వ్యాప్తంగా! కాని అటువంటి కృషికి ముందుకు వచ్చే వారే కనపడడం లేదు. ఆ వీరభోగ వసంత రాయలు ఎవరో ముందుకు వచ్చి బహిరంగంగా కంకణం కట్టుకోగలిగితే గలిగితే అప్పటి మాట జిల్లాలోని కాంగ్రెస్‌లో రెండవ గ్రూపు అవతరణ! అప్పటి వరకు అది గాలి కబురుగా అంతరిక్షంలో పరిభ్రమిస్తూ వుంటుంది.

ఈనాడు కాంగ్రెస్ వ్యతిరేక పార్టీలన్నీ విజృంభిస్తున్నాయి. కాంగ్రెస్ ప్రతిష్ట, బలం మైనస్‌లో వున్నాయి. గ్రూపు తత్వాలు, గ్రూపులు, వ్యక్తిగత ద్వేషాసూయలతో కాంగ్రెస్ వాదులు చెల్లా చెదరైతే, సంస్థ కుక్క చింపిన విస్తరైతే, అందరూ మునుగుతారు. అది గమనించి వ్యవహరించండి!

## నెల్లూరు రిజర్వ్డా?

గత పర్యాయం జిల్లాలోని మూడు మునిసిపాలిటీలలో రెండు రిజర్వుడు, ఒకటి జనరల్‌గా వుండేవి. ఈసారి ఏది ఏమవుతుందో తెలియడం లేదు. గూడూరు జనరల్, నెల్లూరు రిజర్వుడు అవుతుందని వదంతి. కావలి సంగతి తెలియడం లేదు. ఈ వదంతికి కొందరి భయసందేహాలే ఆధారమా అనిపిస్తుంది. 1981 లో జరిగినట్లు కొందరు వ్యక్తుల బెడదను వదలించు కోవడానికి ఈసారి కూడా రిజర్వుడు చేయబడ వచ్చునని అనుమానం తీవ్రంగా వుంది. జనార్దన రెడ్డి అంటే అంత భయం; ఏమి చేస్తాం!

ఎస్.సి., ఎస్.టి. ల రిజర్వేషన్లను వ్యతిరేకించ వలసిన అవసరం లేదు. వ్యక్తిత్వము, స్వతంత్ర పోకడ వుండే వ్యక్తులు పదవులకు రాగలిగితే రిజర్వేషన్లు సార్థకం అవుతాయి. అట్లా కానప్పుడు? - పాముల పాలిట శాపమే అవుతుంది! రిజర్వుడు అవకాశంతో ఛైర్మన్లు అవుతున్న వారు కీలు బొమ్మలుగా నామకార్థంగా వుంటున్నారు గాని, స్వతంత్ర పోకడతో పోలేకున్నారు. పట్టభద్రులు, గజిటెడ్ ఆఫీసర్లుగా రిటైరైన వారు సైతం వ్యక్తిత్వంతో వ్యవహరించలే కున్నారు. పేరు వారిది, పరిపాలన వేరొకరిదిగా వుంటున్నది. ప్రత్యక్ష అనుభవంతో చెప్తున్న మాట ఇది.

మూడు మునిసిపాలిటీలలో కాంగ్రెస్‌లో వర్గాలున్నాయి; రెండు మూడుగా కూడా చీలిపోయి వున్నాయి. జనరల్ అయినా, రిజర్వుడు అయినా ఈ గ్రూపులు ఎక్కడకూ పోవు; ఆ ప్రాతి పదికనే అభ్యర్థిత్వానికి పోటా పోటీలుంటాయి; ఆ చిక్కు విడదీయడం నాయకులకు పెద్ద సమస్య. జనరల్ అయినా అభ్యర్థుల నిర్ణయం కాంగ్రెస్‌లోని గ్రూపుల పునర్ వ్యవస్థీకరణకు ప్రాణం పోస్తుంది. ఈసారి కాంగ్రెస్ కాదు, బి.జె.పి., తెలుగుదేశం, లెఫ్ట్ పార్టీలూ రంగంలో వుంటాయి. దేశము, లెఫ్ట్ ఏకమైనా స్వతంత్రులు కాక త్రిముఖ పోటీ అనివార్యం.

నెల్లూరులో మూడు బృందాలు సన్నాహంలో వున్నాయి; నాల్గవ బృందం తలబెట్టినా ఆశ్చర్యం లేదు. గూడూరులో మూడు వర్గాలు ప్రత్యక్షంగానే కనపడుతున్నాయి. కావలిలో మాత్రం ఒకటే వుండవచ్చునేమో! నాయకుడనే వాడు వ్యక్తిగత రాగ ద్వేషాలు లేకుండా గెలుపే ప్రధానంగా భావించి అందరినీ సమరస పరచి తగిన అభ్యర్థిని నిర్ణయించ గలిగితే సరిసరి; లేకుంటే ఈ మునిసిపల్ ఎన్నికలు రాగల జనరల్ ఎన్నికలలో కాంగ్రెస్‌ను ముంచడానికి కారకమౌతాయి!

దాని సంగతి అటే. ఇక రిజర్వుడు విషయానికొస్తే - ఈ తడవ కైనా తమకు ఆ శిక్ష విధించ వద్దని ముఖ్యంగా సింహపురీయులు మరీ మరీ కోరుతున్నారు; చిత్తగించండి!

NSV





# ఉత్తర క్రియలు

పాలిచర్ల జనార్దనరెడ్డి

జననం: 27-9-1927

27-2-93 తేది శనివారం ఉదయం 8.45 గంటలకు

మా తండ్రి

## పాలిచర్ల జనార్దన రెడ్డి గారు

స్వర్గస్తులైరి

**9-3-93** తేది మంగళవారం రాత్రి నిలుపు

**10-3-93** తేది బుధవారం రాత్రి ఎత్తురేవు

కొడవలూరు మండలం, మానేగుంటపాడు గ్రామంలో

మా స్వగృహమున జరుగును.

బంధుమిత్రులు తెలియగోరుచున్నాము

పాలిచర్ల వెంకటప్రసన్నరెడ్డి

పాలిచర్ల శ్రీనివాసులురెడ్డి

# జమీన్ రైతు

# పాడు చేయవద్దు!

పంచాయితీ రాజ్ వ్యవస్థలో మళ్లీ మరో ప్రయోగం చేయబోతున్నది ప్రభుత్వం. ముఖ్యమంత్రులు మారినప్పుడల్లా, వారి బుర్రలో పురుగు దొల్చినప్పుడల్లా పంచాయితీ వ్యవస్థలో మార్పులు తలపెట్టగం ఆనవాయితీ అయిపోయింది. ఎవరిష్టం వచ్చినట్లు వారు, ఎవరి ఆలోచనా తీరుకను గుణంగా వారు పంచాయితీలను తారు మారు చేసే భ్రష్టు పట్టించ కుండా పంచాయితీలకు రాజ్యాంగ బద్ధ స్వరూపం కల్పించడానికి స్వర్గీయ రాజీవ్ గాంధీ చేసిన ప్రయత్నం ఇంకా ఫలించక పోవడం దురదృష్టకరం. కేవలం రాజకీయ ద్వేషంతో ఆనాడు బిల్లును విరోధించి ప్రతిపక్షాలు తప్పు చేశాయి.

మే లేదా జూన్‌లో జరుగవలసిన పంచాయితీ ఎన్నికలకు కొత్త విధానం ప్రకటించ బోతున్నట్లు వార్తలు వస్తున్నాయి. రెండు మండలాలను కలిపి ఒక సమితిగా చేయాలని, సర్పంచ్‌లతో సంబంధం లేకుండా ఆ కొత్త సమితులకు ప్రత్యేక సభ్యులను ఎంపిక చేయాలని ప్రభుత్వం తలపెడుతున్నది. సర్పంచ్‌లు సమితిలో సభ్యులే కాని వారికి ఓటు హక్కు వుండదట; అట్నే జిల్లా పరిషత్‌లోనూ సమితి అధ్యక్షులు నామమాత్రమట; ఈ గందర గోళమంతా ఎందుకు సృష్టించు కుంటున్నారో అర్థం కావడం లేదు.

సర్పంచ్‌కు సమితిలో ఓటు హక్కు లేకుంటే ఇక పంచాయితీలకు ఎన్నికలు జరుపడమెందుకు? గ్రామ సమస్యలు సర్పంచ్‌లకు తప్ప మరెవరికి తెలుస్తాయి? మూడు అంచెలలో సర్పంచ్‌లు, సమితి అధ్యక్షులు, జిల్లా పరిషత్ ఛైర్మన్లు వుండేటప్పుడు మళ్లీ ప్రాదేశిక నియోజక వర్గాలెందుకు? ఆ సభ్యులు ఏమి పని చేస్తారు? ఎక్కడ పనిచేస్తారు? ఎవరికి ప్రాతినిధ్యం నెరపుతారు? కేవలం సమావేశాలకు హాజరు కావడమే వారి పనా? లేక సర్పంచ్‌లు, సమితి అధ్యక్షులతో సమాంతరంగా వారికీ విధులు, నిధులు కేటాయిస్తారా? సమావేశాలలో పాల్గొని ఓటువేసే అధికారం లేని సర్పంచ్‌లను ఏ అధికారి గుర్తించి, గౌరవిస్తాడు? ఎట్లా పనులు చేస్తారు? ఎందుకీ తికమక?

ఎన్టీఆర్ ప్రవేశ పెట్టిన మండల వ్యవస్థ మొదట్లో అపభ్రంశంగా కన్పించినా తర్వాత తర్వాత కుదుట పడి సాగిపోతున్నది. ప్రజలు దానికి అలవాటు పడ్డారు. భవనాలు సమకూరాయి. దాని కంటే మెరుగైన వ్యవస్థను ఏర్పర్చే పక్షంలో మార్పులు తలపెట్టాలి కాని, గందరగోళం సృష్టించి, ప్రజలను అయోమయంలోకి పడద్రోసే మార్పులు దేనికి? చెన్నారెడ్డి గారు తొలిసారి ముఖ్యమంత్రి అయినప్పుడు ఎమ్మెల్యే నియోజక వర్గానికి కో టెర్మినస్ చేస్తూ విశాలమైన సమితులు ఏర్పాటు చేయ తలపెట్టారు. అది ఉదాత్తమైన ఆలోచన; ప్రజలకు అనుకూలమైనది. ప్రభుత్వం అటువంటి ఆచరణాత్మక మార్పులు తలపెట్టాలే తప్ప, అయోమయ పరిస్థితులు కల్పించరాదు.

పరోక్ష ఎన్నికల విధానమూ విన్పడుతున్నది — ఇదీ సరైనది కాదు. పరోక్ష పద్ధతిలో ఎన్నికలంటే గెల్చే వారికి ప్రజాభిమానం కంటే కండబలం, ధన బలం అధికంగా కావలసి వస్తుంది. కిడ్నాప్‌లు చేసి, కొనుగోలు చేసి ఎన్నిక కావలసి వుంటుంది. గెల్చిన తర్వాత కూడా ప్రతి క్షణం భయపడుతూ, అలిగే వారిని దువ్వుతూ, ప్రలోభాలతో మంచి చేసుకుంటూ కాలం గడపాలి. దీని వల్ల ప్రజా సేవకంటే, సభ్యుల సేవకే కాలం సరిపోతుంది. గెల్చే వారి పై చెక్ వుండాలను కుంటే ప్రత్యక్ష ఎన్నికలు జరిపి, ఆ సంస్థలలోని సభ్యులకు రెండేళ్ల కొకసారి అవిశ్వాస తీర్మానం ప్రతిపాదించే అధికారం, హక్కు కల్పించడం సముచితం. పరోక్ష ఎన్నికలోనూ ఇద్దరు సభ్యులను నామినేట్ చేయాలనే ఆలోచన చేస్తున్నారట. అదే జరిగితే ఎన్నికలే వ్యర్థమౌతాయి. పంచాయితీలలో కాని, సమితులలో కాని, జిల్లా పరిషత్‌లో కాని ఇద్దరు సభ్యులను అధికార పార్టీ నాయకులు చొప్పించ గల్గితే, గెలుపు ఓటములు తారు మారౌతాయి. సహకార సొసైటీలలో జరిగిందిదే. ఎన్నికలలో గెలవలేమనే పిరికితనంతో, ఏ తీరులోనైనా అధికారం తమది కావాలనే సంకుచిత తత్వంతో చేసే ఇటువంటి నిర్ణయాలు ప్రజాస్వామ్యాన్నే అపహాస్యం పాల్జేస్తాయి.

ఇప్పటికే పంచాయితీ వ్యవస్థలో ప్రజా ప్రతినిధుల కంటే అధికారులకు అధిక అధికారాలు కట్టబెట్టి, ఆ సంస్థల పట్ల రాజకీయ వాదులలో, ప్రజలలో ఆసక్తి లేకుండా చేశారు. 10 లక్షల ఓట్లతో పదవిలోకి వచ్చే జి.ప్ర. ఛైర్మన్ పై, ఓనమాలు తెలియని యువ ఐఎఎస్ అధికారులను పెత్తనానికి పంపి అవమానిస్తున్నారు. ఈ పరిస్థితులలో ఎన్నికల విధానాన్ని తలక్రిందులు చేసి, లోప భూయిష్టంగా మార్చితే పంచాయితీలు పూర్తిగా విలువ కోల్పోతాయి. ప్రభుత్వానికి ఈ వ్యవస్థ పై విశ్వాసం వుంటే, ప్రజా ప్రతినిధులు ప్రజాస్వామ్య బద్ధంగా ఎన్నికయ్యేట్లు, పూర్తి అధికారాలతో స్వతంత్రంగా వ్యవహరించ గల్గేటట్లు చట్టం రూపొందించాలి. అందుకు మనస్కరించ కుంటే అసలు ఎన్నికలే లేకుండా అధికారులకే పాలన అప్పచెప్పడం ఉత్తమం.

## 50 ఏళ్ళ క్రితం ఈ వారం

### జమీన్ రైతు

5.3.1943

4 పేజీలు 0-1-0

సంపాదకీయం

### వ్రతానంతరం

సర్వేశ్వరుని కృప వల్ల నిర్విఘ్నంగా నిజ ఆత్మపరీక్షా యుతమైన ప్రాయోపవేశన దీక్షను ముగించుకొని గాంధీ మహాత్ముడు నిందాకళంకాన్ని విశ్వనాయక స్థానంలో బావుకొని బయటబడినాడు. జానకీ దేవి అగ్నిప్రవేశమై పవిత్ర భూతయై రాణించిన పుణ్యదినము వంటిదే ఈ 3వ తేదీ. ఇంకను ప్రభుత్వము శంకను వీడలేకున్న అది గాంధీజీ బాధ్యత గాదు. రాజకీయ దృష్టిలో ప్రభుత్వానికి లాభదాయకం కానేరదేమో!

స్థిత ప్రజ్ఞానికి అలివి గానిది లేదు. భృహత్ వారీ గ్రంథంలో గాంధీజీ గ్రహకూటాను గుణ్యంగా నడవరు గాని, ఆ గ్రహాలే యీయన సంకల్పాను గుణ్యంగా స్థానాలు మార్చుకొంటవి అని వ్రాసిన వ్రాత సత్యం నేటికి ధృవపడింది అనాల. లేకుంటే దినదినానికి క్రుంగ వలసిన పండు దేహం ఉత్తేజకరమై ఉల్లాసపు వెల్లువలో తేలి పోతుండింది అంటే దైవిక శక్తి ఆత్మశక్తి మూలంగా వ్రతాన్ని నడిపింది అనాల. ఎట్లనైతే నేమి మన బాపూజీ మనకు దక్కినాడు. భారతమాత — భారత ప్రజ ధన్యము! ఈ మహత్తర యుగంలో ఉన్నా మనస్సురణ ఏ వ్యక్తిని పులకితము చేయదు?

పర్యాలోచనము

### హిందూమహాసభ పదవీ వ్యామోహం

విప్లవ బ్రహ్మ వీరసావర్కార్ కాలధర్మంలో దేశారాధన శక్తి ఉద్దీపించి, మహావేశంతో మునిగి పోవడం చారిత్రక విషాద గాథలలో కెల్ల అనుకంపా పూర్ణమైందికాని, దేశ గౌరవం దుమ్ములో గలుపుతూ, అఖిల భారత ప్రజ కులగురువు — ఆదర్శదేవుడు — స్వాతంత్ర్య ప్రదాత — శిష్యుడు గాంధీ మహాత్ముడు మరణ శయ్యాగతుడై త్యాగము పేక్షించే దారుణ సమయంలో గూడ మేడి పండు వంటి అధికారాలను ఆత్మగౌరవ ప్రదర్శక చిహ్నం గాగూడ వదల రాదని జ్వాలా ప్రసాద శ్రీవత్సవ గారిని వైస్‌రాయి కార్యనిర్వాహక సంఘం నుండే బయట బడవలె నంటే నిరోధించడం మాత్రం దేశానికి — హిందూ మహాసభ, కాదు — సావర్కార్ మూంజీ గారలు చేసిన ద్రోహం అనాల. ఇంకా దేశ దౌర్భాగ్యం అనాల.

ఈ పదవులు — గౌరవ హీనంగా, అధికార హీనంగా ఉండి, దేశ స్వాతంత్ర్య నిరోధక సాధనంగా పాలకులచే ఉపయోగ పడుచుండుట, దుష్ఫలనా బాధ్యతను మాత్రం వహించే "తథాస్తు దేవతలుగా" వున్నప్పుడే వీరు యింత తృష్ణ చూపుతుంటే యథార్థ అధికారానికి ఎంత ప్రాకులాడెదరో!

దీనికి శ్యామప్రసాద ముఖోపాధ్యాయుడు, మహేశ్వర దయాల్ మొదలగు వారు అసమ్మతి జూపుట గాఢాంధకారంలో అరుణ రేఖ.

### మంత్రుల అధికారం

మంత్రులకు — వైస్‌రాయి సభ సభ్యులకు అధికారం లేదని పదే పదే వెల్లడైనా, తమకు కావలసి నప్పుడు అమెరీ ప్రభృతులు హైందవులే పాలిస్తున్నారనే బూరగకు వీరిప్పుడు శ్రుతి వేయడం రాజకీయం కానేరదు!

వైస్ రాయి సభలో 9 మంది హైందవు లుండేది నిజమే! వారి మాట ఎంత సాగుతున్నది? గాంధీ వైస్‌రాయి ఉత్తర ప్రత్యుత్తరాలు మాత నోచుకోలేదు. నాయకులు ఎక్కడుండేది విన నోచుకోలేదు. అట్టి నామినేటెడ్

కొరవ 10 పేజీలో

# జిల్లా రాజకీయాల్లో ఇంక రంజేది!

సింహపురి సింహం, ఓటమి ఎరుగని ధీశాలి, ప్రజల పాలిటి పెన్నిధి, కార్యశూరుడుగా పేరెన్నిక గన్న శీనన్న కనుమూయడం బాధాకరమైన విషయం. శ్రీనివాసులు రెడ్డి గారికి అరవై ఏళ్ళకే నూరేళ్ళు నిండాయంటే నమ్మలేకున్నాను. 1972లో జై ఆంధ్రా వుద్యమంలో రాష్ట్రస్థాయి నాయకత్వానికి ఎదిగి ఆనాటి ముఖ్యమంత్రి, నేటి ప్రధానమంత్రి పి.వి.నరసింహారావు పదవిచ్యుతికి కారకుడైన నాయకుడాయన. ఆయన మరణం ఫలితంగా జిల్లా రాజకీయాలు చప్పబడి పోతాయి. అసెంబ్లీలో తనదైన ఫక్కీలో అన్ని వైపుల్ని ఆకట్టుకొనే రాణింపు గల నాయకుడు. గైరుహాజరు కాని ఆయన రికార్డు ఎవరూ బద్దలు కొట్టలేరు. ఒక సారి పరిచయమైన వ్యక్తిని మరలా ఎప్పుడు చూసినా పేరుతో సహా పలుకరించే అరుదైన వ్యక్తి. ఆయన మృతితో; జిల్లా లో ఒకశకం అంతరించింది.

దర్గామిట్టలో ఆయన నివాసమున్న ప్రాంతానికి శీనయ్యనగర్ గా పేరు పెట్టాలని కోరుచున్నాను.

నెల్లూరు — వి.సాయి కాశ్యప

### ప్రజాభిమానం పొందిన నాయకుడు

శ్రీ నల్లపురెడ్డి శ్రీనివాసులురెడ్డి మృతి అశనిపాతంలా తగిలింది. మారుతున్న రాజకీయ, సాంఘిక పరిణామాల కనుగుణంగా ఎప్పటి కప్పుడు మారుతూ వచ్చినా, ప్రజలలో అట్టడుగు స్థాయినుండి అభిమానుల్ని సాధించుకో గలిగిన సమరశీలి శీనయ్య. నెంబర్ వన్ కాలేక, నెంబర్ టూగా ఇమడలేక నెంబర్ వన్ లకు 'యముడి' గా మనగలిగిన వాడిని సైతం యముడు విడువక పట్టుకు పోవడం దురదృష్టమే.

## జనవాణి

ఒక రాజకీయవేత్తగా ఆయన సిద్ధాంతాలతో అందరూ ఏకీభవించ లేకపోయినా, ఒక నిరంతర శ్రామిక కార్యకర్తగా ఆయన్ను అంగీకరించడంలో ఎవ్వరికీ ఆక్షేపణ లేదనుకుంటా! ఏది ఏమైనా జిల్లా మరచిపోలేని ప్రజాభిమానం గల నాయకుడు శ్రీనివాసులు రెడ్డి.

కంచి — సూరం సురేష్

### అభివృద్ధి కి కారకుడు శీనయ్య

నెల్లూరు జిల్లా అభివృద్ధికి విశేష కృషి సల్పిన వారిలో శ్రీ నల్లపురెడ్డి శ్రీనివాసులు రెడ్డి ఒకరు. సోమశిల ప్రాజెక్టు మొదటి దశ పూర్తి చేయడంలోనూ, తెలుగు గంగ కాల్వను జిల్లాలో ప్రవహింప జేయడంలో ఆయన

కొరవ 10 పేజీలో

# ఇది నిజంగా మన బడ్జెట్టేనా?

## నమ్మబుద్ధి కావడం లేదు!

ప్రధానమంత్రి గా శ్రీ పి.వి.నరసింహారావు బాధ్యతలు చేపట్టిన తర్వాత చేసిన ఏకైక మంచి పని ఏదైనా వుందంటే - అది మన్మోహన్ సింగ్ కు ఆర్థిక శాఖ కట్టబెట్టడమే! ఇందిరా గాంధీ, రాజీవ్ గాంధీలు సైతం ఆయా రంగాలలో నిష్ణాతులైన అధికారులను, శాస్త్రవేత్తలను తమ మంత్రి వర్గంలోకి తీసుకుని ప్రయోగాలు చేశారు. కాని, వారికి వారు పూర్తి స్వేచ్ఛ ఇవ్వకపోవడం వల్ల ఆ ప్రయోగాలు విఫలమైనాయి. పివి దూరదృష్టి తో ఆలోచించి ఆర్థిక విధానం రూపకల్పన, వాటి అమలులో మన్మోహన్ సింగ్ కు సంపూర్ణ స్వాతంత్ర్యం ఇచ్చారు. దాని ఫలితమే ఇటువంటి విస్మయకర బడ్జెట్.

రెండు రెళ్ళు నాలుగనే లెక్క మాత్రమే తెలిసిన దేశానికి, రెండు రెళ్ళు ఒకటి ఈజ్ ఈక్వల్ టు నాలుగు అనే నూతన గణితాన్ని ప్రదర్శించి తికమక పెట్టేస్తున్నారు మన్మోహన్ సింగ్. స్వాతంత్ర్యం వచ్చిన తర్వాత ఇప్పటివరకు ఏ బడ్జెట్ లోనూ ధరలు తగ్గించడం చూడలేదు మనం; రెండేళ్ళ క్రితం వరకు బడ్జెట్ అంటే భయపడి చచ్చేవారు జనం; ఈ ఏడాది కూడా "బడ్జెట్ ముందే కొనండి" అనే వ్యాపారుల ప్రకటనలు, బ్యానర్లు కుప్పతిప్పలుగా దర్శనమిచ్చాయి. తీరా అది బయట కొచ్చేసరికి జనం ఆశ్చర్యంతో నివ్వెరపోతే, ధరలు పెంచడం కోసం వస్తువులు దాచిపెట్టిన వ్యాపారులు గుండెలు బాదుకున్నారు. అమెరికా వంటి అగ్రరాజ్యం కూడా బడ్జెట్ లోటు పూడ్చుకోవడానికి "సిన్ ట్యాక్సెస్" పేరుతో సిగరెట్ల వంటి వాటిపై సైతం ఇబ్బడి ముబ్బడిగా పన్నులు దంచేస్తుంటే, మన్మోహన్ సింగ్ పన్నుల్లో కోత పెట్టి ప్రపంచం ఆశ్చర్య పోయేలా చేశారు. బంగారు తాకట్టు పెట్టి అప్పులపై వడ్డీలు కట్టవలసిన దుస్థితి నుంచి ఆర్థిక వ్యవస్థను కాపాడే బాధ్యత మన్మోహన్ సింగ్ పై పడింది. అది చిన్న బరువు కాదు. ఆ సవాల్ ను స్వీకరించడంతో ఆయన నెహ్రూ, ఇందిరాగాంధీల సోషలిజం బాటను ప్రక్కకు తప్పించేశారు. కొరియా, థాయిలాండ్ వంటి పశ్చిమాసియా దేశాలనుసరించి, విజయం సాధించిన సరళీకృత విధానాల మార్గం తొక్కారు. ఎప్పుడో ముప్పైఏళ్ళ క్రితమే రాజాజీ వంటి

> "ధరలు తరుగుట
> పెరుగుట కొరకే నన్న
> సూత్రాన్ని ఛేదించి
> ధరలు తగ్గించి
> భారతీయుల పై
> రాయితీల వర్షం
> కురిపించాడు
> మన్మోహన్ సింగ్!"

మేధావులు హెచ్చరించినా ఇంతకాలం మనం వదలలేని కంట్రోళ్లు, పర్మిట్ల రాజ్యాన్ని క్షాళన చేసి, సోషలిజం అనే నినాదాన్ని వినపడనివ్వ కుండా ఆర్థిక శకటాన్ని నడిపించేస్తున్నాడు మన్మోహన్ సింగ్.

మన్మోహన్ మాయాజాలం రుచి గత సంవత్సరమే చవి చూచాం. ఈ సంవత్సరపు బడ్జెట్ టివిలో చూసిన వారి కెవరికీ అది నిజమని నమ్మబుద్ధి కాలేదు. లక్షా 31 వేల 323 కోట్లతో కొత్త బడ్జెట్ ప్రతిపాదించారు మన్మోహన్ సింగ్. గత సంవత్సరం కంటే ఇది కేవలం 6597 కోట్లు (5.29 శాతం) ఎక్కువ. ఈ బడ్జెట్ విశేషం లోటు అతి తక్కువ స్థాయిలో - 4.314 కోట్లు వుండడం. గత పదేళ్లలో తక్కువ లోటు ఇది. నిరుటితో పోల్చినా 2888 కోట్లు తక్కువ. కాని నిజమైన లోటుగా పరిగణింప బడే ఫిస్కల్ డెఫిసిట్ మాత్రం నిరుటి కంటే 237 కోట్లు పెరిగి - 36 వేల 959 కోట్లు అయ్యింది. ప్రభుత్వానికి రాబడి పన్నుల ద్వారా 84 వేల 209 కోట్లు, కొత్త అప్పుల ద్వారా 32 వేల 645 కోట్లు, ఇతర పద్దుల ద్వారా 10,155 కోట్లు కలసి మొత్తం లక్షా 27 వేల కోట్లు వస్తున్నది. ఖర్చులో ప్రణాళికేతర వ్యయమే ఎక్కువ - 90 వేల కోట్లు; అందులో కేవలం పాత అప్పుల పై వడ్డీలకే 38 వేల కోట్లు వెళ్లి పోతున్నది. ప్రణాళికా వ్యయం - అంటే, అభివృద్ధి కార్యక్రమాల పై పెట్టే ఖర్చు - 41 వేల 251 కోట్లు మాత్రమే.

మొత్తం మీద 4500 కోట్ల వరకు పన్నులు తగ్గించాడు మన్మోహన్ సింగ్. ఇంత పెద్ద మొత్తం పన్నులు తగ్గించి, లోటును కుదించి ఎట్లా బడ్జెట్ తయారు చేశాడా అన్నదే అందరి ఆశ్చర్యం. అక్కడే ఆయన ప్రతిభా పరిణతులు వ్యక్తమౌ తుండేది. కొత్త అప్పుల ద్వారా ఆదాయం పెంచి (3 వేల కోట్లు) ప్రణాళికేతర వ్యయంలో పొదుపు పాటించి జనానికి ఊరట కల్పించాడు. ప్రభుత్వ రంగ సంస్థలకు ప్రభుత్వం నుంచి ఏటా వచ్చే నిధులకు కోత పెట్టి, షేర్లు అమ్ముకొని బ్రతకమని వాటిని ఆదేశించాడు.

### రూపాయిని ఎక్కడైనా అమ్ముకోవచ్చు

ఈసారి బడ్జెట్‌లో కెల్లా విశేషం - రూపాయిని పూర్తి స్థాయి మారక ద్రవ్యంగా పరిగణించడం. ఇది వరకు అంతర్జాతీయ మార్కెట్‌లో రూపాయి ధరను ప్రభుత్వం నియంత్రించేది. ఎగుమతులు, దిగుమతుల ద్వారా లభించే డాలర్లు ప్రభుత్వ ఖజానాలో జమయ్యేవి. డాలరుకు ప్రభుత్వ ధర ఒకటిగా, బ్లాక్‌లో హవాలా మార్కెట్ ధర ఇంకొకటిగా వుండేది. గత సంవత్సరం బడ్జెట్‌లో ఎగుమతుల ద్వారా వచ్చే డాలర్లలో 60 శాతం బహిరంగంగా విక్రయించు కునేందుకు అనుమతించారు. ప్రభుత్వం పెట్రోలు వగైరాల దిగుమతులకు 40 శాతం డాలర్లు తను చెప్పిన ధరకు తీసుకునేది. మార్కెట్ రేటు 32 వరకు వుంటే. ప్రభుత్వ రేటు 25 దాట లేదు. అంత మేరా ఎగుమతి దారులు నష్టపోయి నష్టి లెక్క. ఇప్పుడు ఎగుమతుల ద్వారా వచ్చే విదేశీ ద్రవ్యమే కాక, విదేశాలలో వుండే భారతీయులు సైతం స్వేచ్ఛగా డాలర్లు తెచ్చి, అమ్ముకోవచ్చు. దీనివల్ల ఎగుమతి దారుల ఆదాయం కనీసం 6 శాతం పెరుగుతుంది. ఏ పౌరుడైనా ఇప్పుడు నేరుగా బ్యాంకుకు వెళ్లి, కావలసినన్ని డాలర్లు అడిగి, కోరిన యంత్రాలు, పరికరాలు దిగుమతి చేసుకోవచ్చు. ఎవరి

కొరవ 10 పేజీలో




### * వృక్షో రక్షతి లాడ్జి సౌందర్యం రక్షితః!

అశోకుడు చెట్లు నాటించెను అనే పాఠాలు చిన్నప్పట్నుంచి చదువుతున్నాం; వృక్షో రక్షతి రక్షితః అని అటవీ శాఖ మన వెవిలో ఇల్లు కట్టుకొని అరచి చేస్తున్న నినాదాలు వింటున్నాం; టివి ఆన్ చేసినా, పేపరు తెరిచినా వనాల పరిరక్షణ పై ప్రకృతి ప్రియులు చేసే అలజడి తెలుసు కుంటున్నాం; కాని మన కళ్ల ముందు పచ్చటి చెట్లను నిలువునా నరికేస్తుంటే మనకేమీ పట్టనట్లు వెళ్లి పోతున్నాం; నరికిన చెట్టుకు ఆనవాలు కన్పడకుండా మొదలుతో సహా కాల్చి బూడిద చేస్తుంటే ఫోగ మంట చందంగా భావించి సర్దుకపోతున్నాం!

పైన వున్న బొమ్మ చూడండి! రెండు వారాల క్రితం వరకు అక్కడ రెండు పెద్ద చెట్లుండేవి. ఎన్నేళ్ల క్రితం నాటివో కాని, రెండడుగులకు మించిన వ్యాసం కలిగిన కాండంతో, పచ్చటి ఆకులతో నీడ నిస్తుండే వి. పోయే జనానికి నీడనివ్వడం తప్ప, రోడ్డులో వెళ్లే ట్రాఫిక్‌కు ఇబ్బంది కల్గించక, ఒక వారగా వుండేవి. ఆ

డోలేంద్ర

ప్రక్కనే వెలిసిన తన నాలుగంతస్తుల లాడ్జి భవనం అందానికి అవి అడ్డుగా వున్నాయని యజమానికి తోచిందట. బందుత్వ రూపేణా రాజకీయ ప్రాభవ ప్రాప్తి కల్గిన సంపన్నుడాయన. రాజా వంటి వాడు తల్చుకుంటే అఫ్టరాల్ చెట్లు పుట్టలదేముంది - రాత్రికి రాత్రి వాటికి ఆయువు మూడింది. తెల్లవారే

కొరవ 8 పేజీలో

# చికిత్స చేయగల్గినా దేశంలో కోటీ 20 లక్షల మంది అంధులు

దేశంలో ఈనాడు 70 లక్షల మంది వరకు అంధులు కావడానికి కారణమైన వ్యాధి - క్యాటరాక్ట్. 50 సంవత్సరాల వయస్సు పై బడిన వారికి ఇది ఎక్కువగా సంక్రమిస్తుంది. దీనికి కారణమేమిటో స్పష్టంగా తెలియదు;

డాక్టర్ బి. శివప్రతాప రెడ్డి

దీనివల్ల కంటిలోని కటకం (లెన్స్) మసక బారుతుంది. కేటరాక్ట్ చికిత్సకు చాలా మార్గాలున్నాయి. దెబ్బతిన్న కటకాన్ని తొలగించి, కంటి అద్దాల ద్వారా చూపు కల్పించడం వాటిలో ఒకటి. చాలా స్వల్పమైన ఆపరేషన్ ప్రక్రియ ఇది. కాంటాక్ట్ లెన్సెస్, ఇంట్రాక్యులర్ లెన్స్ అమర్చడం ద్వారానూ కేటరాక్ట్ రోగులకు చూపు ప్రసాదించవచ్చు. ఆస్పత్రులలో కాని, నేత్ర వైద్యశిబిరాలలో కాని దేశంలో ఏటా 12లక్షల కేటరాక్ట్ ఆపరేషన్లు జరుగుతున్నాయి.

### కార్నియల్ (నల్లగుడ్డు అంధత్వం)

26 లక్షల మంది నేత్ర రోగులు కార్నియల్ సంబంధిత అంధత్వం తో బాధపడుతున్నారని అంచనా. ఇవి చాలావరకు నివారించదగినవే. నల్లగుడ్డు వ్యాధి ఇరవై సంవత్సరాల లోపు వయస్సు కల్గిన వారిలో ఎక్కువగా వస్తుంటుంది. సరైన జాగ్రత్త తీసుకోక పోతే వారి భావిజీవితాన్నంతటినీ చీకటిమయం చేస్తుంది. కార్నియల్ బ్లైండ్‌నెస్ అంటే - కంటిలోని పారదర్శకమైన వెలుపలి భాగం మసకబారడం. సరైన పౌష్టికాహారం లేకపోవడం, కంటికి దెబ్బ తగలడం, ఆటలమ్మ,మశూచి వంటి జబ్బులవల్ల ఇన్‌ఫెక్ట్ కావడం తదితర కారణాలవల్ల ఈ వ్యాధి సంక్రమిస్తుంది. ఈ కారణాలన్నింటి వలన కూడా వ్యాధి తీవ్రమై కంటిచూపు పూర్తిగా పోయే ప్రమాదం వుంది. అయితే సరైన జాగ్రత్త తీసుకుంటే ఆ ప్రమాదాన్ని నివారించవచ్చు; మసకబారిన నల్లగుడ్డు



కంటిలో భాగాలు

1) నల్లగుడ్డు, 2) తెల్లగుడ్డు, 3) అక్వియస్ ద్రవం, 4) కటకం (లెన్స్), 5) కోరాయిడ్, 6) రెటినా 7) విట్రియస్ ద్రవం, 8) కంటి నరం.

ను కూడా సరిచేసి చూపు కల్పించవచ్చు.

నల్లగుడ్డు లో ఏర్పడే మచ్చ, మసకబారడాలను నివారించేందుకు ఆరోగ్య విషయాలపై అవగాహన పెంచడానికి విస్తృత ప్రచారం చేయడం ప్రథమ కర్తవ్యం. పరిసరాల పరిశుభ్రత పాటించడమూ ఒక అవసరమే. ఫ్యాక్టరీ లో కంటికి ప్రమాదాలు జరగకుండా తగిన జాగ్రత్తలు తీసుకోవాలి. వీటన్నింటికంటే ముఖ్యమైనది-పిల్లలకు బలవర్ధకమైన ఆహారం ఇవ్వడం. ఆహార లోపం వలన నల్లగుడ్డు దెబ్బతిని పోవడం (xerophthalmia) మెత్తబడి పోవడం (keratomalocia) జరుగుతుంటాయి. వీటివలన నల్లగుడ్డు పనిచేయకుండా పోయి, అంధత్వం వస్తుంది. ఈ వ్యాధి వలన బాధపడే

కొరవ 11 పేజీలో

# ఎన్నటికీ చెదరనివి మీ స్ఫూర్తి... స్మృతి



## శ్రీ రావి జనార్ధన చౌదరి గారు

(మేనేజింగ్ డైరక్టర్ - పి.ఇ.ఎస్. ఇంజనీర్స్ ప్రైవేట్ లిమిటెడ్, హైదరాబాదు)

*గడచింది ఏడాదే అయినా*
*ఒక యుగం గడచినట్లుంది*
*అనుక్షణం మీ రూపం*
*మా కళ్ళ ముందు కదలాడుతూనే వుంది!*
*మా జ్ఞాపకాల దొంతరలలో*
*మీ స్మృతి పదిలంగా నిల్చే వుంది!*
*ఇంకెన్నేళ్ళు గడచినా మా*
*మనఃఫలకాల నుంచి*
*మీ రూపం చెదరిపోదు*
*మీ స్ఫూర్తి వదలిపోదు!*
*కన్నుల నిండా నీటితో*
*సమర్పిస్తున్నాం శ్రద్ధాంజలి!*

**సాంవత్సరీకం**

సాంవత్సరీక కార్యక్రమాలు
8.3.1993 తేది
దూరులో జరుగును!

### సోదరులు

రావి రమణయ్యనాయుడు
రావి శ్రీనివాసులు నాయుడు
రావి సుధాకర్‌చౌదరి, (Chief Executive, Sarvodaya Sugars, chellur)

### సోదరి

పర్లమూడి రమణలత

రావి రాధాకుమారి (భార్య)

రావి వాసు దేవ ప్రసాద్, బి.ఇ., ఎం.ఎస్ (అమెరికా)
Managing Director, PES Engineers Pvt., Ltd.

రావి సురేష్, బి.ఇ.
Executive Director
— కుమారులు

డాక్టర్ యలమంచిలి చంద్రశేఖర చౌదరి
డాక్టర్ యలమంచిలి లక్ష్మి (లండన్) — అల్లుడు- కుమార్తె

చిరంజీవి ప్రియా— మనుమరాలు

పిఇఎస్ ఇంజనీర్స్ ప్రై.లి సిబ్బంది

- మా కంపెనీ ఇప్పటి వరకు జల విద్యుత్ రంగంలో 800 మెగావాట్ల జెనరేటింగ్ సెట్లు నెలకొల్పి ప్రారంభించింది.
- విశాఖ స్టీల్ ప్లాంట్‌లో కొన్ని పరికరాల కష్టతరమైన స్థాపన, కృష్ణా–గోదావరి బేసిన్‌లో ONGC వారి భూగర్భ పైపింగ్ పని బరోడా వద్ద ఇండియన్ ఆయిల్ కార్పొరేషన్ వారి హైడ్రో క్రాకర్ ప్రాజెక్ట్ పనులు పూర్తి చేసితిమి.
- కాద్రా, కొడసల్లి, గెరుసొప్ప మని డ్యామ్, వంట నది, జోగ్ ఫాల్స్ (కర్నాటక పవర్ కార్పొరేషన్), అప్పర్ ఇంద్రావతి, అప్పర్ కోలాబ్ (ఒరిస్సా) సీలేరు (ఆంధ్ర), సూర్యగండక (బీహార్) దొల్హస్తి (జమ్ము), పనులు ప్రస్తుతము మా కంపెనీ ఆధ్వర్యంలో జరుగుచున్నవి.

# నెల్లూరు రచ్చబల్లల్లో
## విశ్లేషకుడు

### జెనివాలో జనార్దన రెడ్డి

శ్రీ జనార్దన రెడ్డి జెనివాలో వున్నారు; కాశ్మీరలో భారత దేశం మానవ హక్కులు వుల్లంఘి స్తున్న దన్న పాకిస్థాన్ ఆరోపణను త్రిప్పికొడుతూ వుపన్యాసం చేశారు; మన వాదనకు ఇతర దేశాల మద్దతును సంపాదించడంలో విశేష కృషి చేస్తున్నట్లుంది.

ఆయన 18 తేది ఢిల్లీ వచ్చి, 19 తేది నెల్లూరు చేరుతారు.

జనార్దన రెడ్డి గారు విశ్రాంతి సమయాల్లో పండిట్ నెహ్రూ సతీమణి కమలా నెహ్రూ క్షయ వ్యాధి గ్రస్తురాలై, స్విట్జర్లాండులో వుండిన ఆరోగ్య కేంద్రం సుజానా నగరాన్ని, మరో కొండ ప్రాంతం మాంట్రో, పట్టణాన్ని చూచారు; స్కేటింగ్ క్రీడనూ చూచారట.

జెనివా నగరంలో ధరలు చాలా సలీసుగా వున్నట్లునాయి. కాఫీ 40 ఫ్రాంకులు; మంచి భోజనం40.5 ఫ్రాంకులు; అన్నీ ఇదే వరుస. ఫ్రాంకు విలువ రూ. 17.45 లు. దీన్ని బట్టి కాఫీ ఖరీదు రూ. 105 లు. భోజనం ఖరీదు రూ700 లు అవుతుందన్న మాట; కారు చవుక!

జనార్దన రెడ్డి తోటి ఆయన భార్య శ్రీమతి రాజ్యలక్ష్మి కూడా వుంది. ఉష్ణోగ్రత - 5 డిగ్రీలట; అక్కడ 12 అయితే మనకు యిక్కడ సాయంత్రం 4.30 గంటలు. అక్కడికి ఇక్కడికి 4.30 గంటలు తేడా అన్నమాట. హోటల్ రూం నుండి బయటకు పోవాలంటే ప్రత్యేక వున్ని దుస్తులతో, ఎవరెస్టు శిఖరారో హకుల వలె, బండో బస్తుతో పోవలసిందేనట. బరువు, భారాలు మోయడం జనార్దన రెడ్డికి అలవాటే గదా!

### వర్షం

2 తేది రాత్రి నెల్లూరు టవును, దానికి దక్షిణంగా వున్నమండలాల్లో కొద్దిపాటి వర్షం. టవున్ లో 2.5 మి.మీ. కాని దర్గామిట్టలో దంచి కురిసింది. తోటపల్లి గూడూరు, పొదలకూరు, రాపూరు, గూడూరు, నాయుడు పేట, వెంకట గిరి, బాలాయి పల్లిలలో కూడా వర్షం. జిల్లా ఉత్తర ప్రాంతంలో చినుకే లేదు.

### రంగడి తిరునాళ్లు

శ్రీ తల్పగిరి రంగనాథస్వామి బ్రహ్మోత్సవాలు 3 తేది నుంచి జరుగుతున్నాయి. ఈ రోజు హంసవాహనం; 6 తేది చంద్రప్రభ; 7 తేది హనుమంత సేవ; 8 తేది గరుడ సేవ; 9 తేది కళ్యాణం; 10 తేది తేరు. ప్రతి రోజూ సాయంత్రం సాంస్కృతిక కార్యక్రమాలున్నాయి. రంగడి సేవకు తరలి రండని భక్తులను పిలుస్తున్నారు ధర్మకర్తలు.

### పెళ్ళకూరు పుట్టినరోజు

యాభైల్లో వున్నాడని కొత్త వారికి చెప్తే నిజమేనని నమ్మేలా, నిత్య యవ్వనోత్సాహంతో పరుగులు పెట్టే పెళ్ళకూరు రామచంద్రా రెడ్డి గారికి 70 నిండాయంటే నమ్మడం కష్టం. 71 జన్మదినోత్సవాన్ని ఈ రోజు (5 తేది) భారీగా, బ్రహ్మాండంగా జరిపించుకున్నారు. ఈ వార్త వ్రాసే సమయానికి కస్తూరిబా కళాక్షేత్రంలో పెళ్ళకూరు పూలమాలలతో, పొగడ్తల వానతో తడిసి ముద్దయి పోతున్నారు. ఆ ముచ్చట్లు [illegible] వారం చెప్పుకుందాం!



సన్మానం కంటే ఘనతరమైనది ప్రధాని శ్రీ పివి నరసింహారావు అత్యంత ఆప్యాయతగా వ్రాసి పంపిన శుభాకాంక్షల సందేశం. మచ్చలేని పెద్దమనిషి, సేవానురక్తి, భగవద్భక్తి కల్గిన రామచంద్రా రెడ్డి గారి వంటి సహృదయ మిత్రులను తన జీవితంలో చాలా కొద్ది మందిని మాత్రమే చూశానని అన్నారు పివి. పెళ్ళకూరుకు అమృతం తాగినంత ఆనందం కల్గిందా సందేశం చదివి; తన తరపున తన కుమారుడు శ్రీ పివి రాజేశ్వర రావును పంపారు ప్రధాని.

వ్యవసాయ సభ జిల్లా స్థాయి వ్యవసాయ పశు ప్రదర్శన 11 నుంచి 13 తేది వరకు చర్చి గ్రౌండ్స్‌లో జరుగుతుంది. డాగ్ షో కూడా వుంది. రైతులకు సత్కాలక్షేపం.

### ఉపఎన్నిక

నల్లపరెడ్డి శ్రీనివాసులు రెడ్డి గారి మరణం వల్ల ఖాళీ ఏర్పడిన కోవూరు నియోజక వర్గం ఉప ఎన్నిక దేశంలోని ఇతర ఉప ఎన్నికలతోటి మే నెలలో జరుగుతుందనే ఆలోచనతో అభ్యర్థుల ఉబలాటాలు, వూహాగానాలు అప్పుడే ప్రారంభమయ్యాయి.

శ్రీనివాసులు రెడ్డి ఉత్తరక్రియలు కాకముందే ఆయన పెద్ద కుమారుడు ప్రసన్న కుమార్ రెడ్డి ప్రకటనకు వుపక్రమించడాన్ని బట్టి సానుభూతి పవనాలు వుంటాయనే అనుకూలతను బట్టి అతని ప్రయత్నం వుండే తీరుతుందను కోవాలి. శ్రీనివాసులు రెడ్డి సతీమణి శ్రీమతి శ్రీలక్ష్మమ్మ మాత్రం పోటీకి సుముఖురాలు కాదంటున్నారు. ప్రసన్న కాంగ్రెస్ టికెట్‌నే కోరబోతాడు.

కోవూరులో పాతకాపు అయిన శ్రీ పెళ్ళకూరు రామచంద్రా రెడ్డి అభ్యర్థిత్వం వుండ వచ్చని ఒక వూహ. హాయిగా, సుఖంగా, నిశ్చింతగా, విశ్రాంతిగా, రాజపోషణగా, దేశ స్థాయి పదవి యైన మూడేళ్ల అభ్కో 'ను వదలి, మూన్నాళ్ల ముచ్చటైన ఈ శాసనసభ్యత్వానికి వస్తాడా? రాడు, రాడు, రాడు!

శ్రీ వేమూరు దేవ కుమార్ రెడ్డి గతంలో ప్రయత్నించి విఫలుడైనారు. ఈసారి ఛాన్సుకు కూడా ట్రయ్ చేయకుండా వుంటాడా? జనార్దన రెడ్డి ప్రత్యేక కృపా కటాక్ష వీక్షణాలు గల వ్యక్తి. శ్రీ ఆనం రామనారాయణ రెడ్డి పేరు వినబడింది గాని, ఆయన్నడిగితే తాను ప్రయత్నించ బోవడం లేదన్నారు. నిదానంగా మరెన్ని పేర్లు రాబోతాయో చూడాలి.

తెలుగుదేశానికి సంబంధించి పెళ్లకూరు ప్రభాకర రెడ్డి, బెజవాడ ఓబుల రెడ్డి గారల ప్రయత్నం ఖాయం. ఓబుల రెడ్డి గారి విషయం తెలియదు గాని, ప్రభాకర రెడ్డికి జిల్లా తెలుగుదేశంలోని అగ్రనాయకుని అభిమానం గల ఒక వర్గ బలం వుంది. దేగా నారసింహా రెడ్డి నామ ధేయం కూడా ఎందువల్లనో నాలుకల మీద నానుతున్నది. ప్రసన్న కుమార్ రెడ్డికి ఏ కారణాల వల్లనైనా కాంగ్రెస్ టికెట్ రాకుంటే, తెలుగుదేశం అభ్యర్థిగా నల్లపరెడ్డి చంద్రశేఖర రెడ్డి రంగంలోకి దిగుతాడేమో నంటారు. ఈయన ఆ పార్టీలోని ఒక ప్రధాన వర్గానికి నాయకుడు గదా!

బి.జె.పి. అభ్యర్థి వుంటాడను కుంటాను. అధ్యక్షులు శ్రీ వరదయ్య స్థానికుడే గదా!

కొరవ 7 పేజీలో



PRIME MINISTER

New Delhi,
February 28,1993

MESSAGE

I heartily felicitate Shri Pellakuru Ramachandra Reddy on his birthday. He has been a steadfast friend of mine and a valued colleague for three decades. I have come across very few persons who are such perfect gentlemen and service-minded and god-fearing.

I wish him many many years of selfless service.

(P.V. Narasimha Rao)

పెళ్లకూరు రామచంద్రారెడ్డిని అభినందిస్తూ ప్రధాని పంపిన సందేశం.







## స్మృత్యంజలి

అక్కన కుమార స్వామి గారు

(విఆర్ కాలేజి)

స్వర్గస్థులై సంవత్సరమైంది వారిని సంస్మరిస్తూ

భార్య: సుందరి

కుమార్తె: కామాక్షి కల్పన

కుటుంబ సభ్యులు



తేగపూడి సుందర రామిరెడ్డి తనయుడు రాజశేఖర రెడ్డి, శోభారాణి; వీరి వివాహం 11 తేది గూడూరులో జరిగింది.

# పెండ్లిండ్లు

మాఘం, శ్రావణం, జ్యేష్ఠం వంటి మాసాలు పెండ్లిండ్లకు ప్రసిద్ధి. పెండ్లి ముహూర్తానికి వున్న వాటిలో అతి శ్రేష్ఠమైన ముహూర్తాన్ని నిర్ణయించమని ప్రతి ఒక్కరూ అడుగుతారు. అందువల్లనే ముహూర్తాలు పెట్టే వారు రెడిమేడ్‌గా కొన్ని తేదులు వ్రాసిపెట్టుకుంటారు. పెండ్లివారు వచ్చిందే తడవు ప్రశస్తమైన ముహూర్తమని చెప్పేస్తారు. పెళ్లివారు సంతోషాంత రంగులై అయ్యవారు చెప్పిన ముహూర్తపు కాగితం వ్రాయించుకొని, ఫల పుష్పదక్షిణ సమేతంగా తాంబూలం సమర్పించుకొని వస్తుంటారు. దీనివల్ల ఈ దైవజ్ఞులు పెట్టే ముహూర్తాలన్నీ ఒకటి రెండు రోజులకే పరిమితమవుతాయి. అతివృష్టి తుఫానులో వచ్చే వరదల్లా ఈ ముహూర్తాలు అహూతులను ముంపుకు గురిచేస్తాయి. పెళ్లివారికి తమదొక్కటే పెండ్లి. పిలువబడిన వారికి అనేకం. ఒకే రోజు, ఒకే గంటలో హాజరు కావలసిన వివాహాలు అసంఖ్యాకం. అందరూ దగ్గర వారే; అన్నీ సొంత పిలుపులే; అన్నీ పోయి తీరవలసిందే. దేనికి హాజరు కావాలి, దేనికి నాగా పెట్టాలి అనేది పోయే వారికి పెద్ద ప్రశ్న. కార్లుండే వారైతే అన్ని పెళ్లిళ్లలో తళుక్కున కనపడి, అటెండెన్సు వేసుకొని, తిరిగి చూచే లోగా అదృశ్యమై మరో పెళ్లిలో ప్రత్యక్షమవుతుంటారు. వాహన వసతి లేని వారి సంగతి?

ముహూర్తాలన్నీ ఒక్కసారి ముంచు కొచ్చేసరికి మరెన్నో సమస్యలు. కళ్యాణమండపం దొరకదు; మేళగాళ్లు దొరకరు; పూలవాళ్లు దొరకరు; పాత్ర సామాను, షామియానాలు కుర్చీలు దొరకవు; వంట వాళ్లు దొరకరు; ఆఖరుకు పురోహితుడు కూడా దొరకడు. రిక్షా, ఆటోఛార్జీల తోటి అన్నీ ప్రియమైపోతాయి. ఇప్పుడు పెండ్లి చేయడమంటే కట్నాలు కానుకలే కాదు తల్లిదండ్రుల సమస్య. ఈ సౌకర్యాలన్నిటినీ సమకూర్చు కోవడం అంత కంటె గడ్డు సమస్య అయింది. అన్నిటినీ అన్నెళ్ల ముందైనా బుక్ చేసుకోక తప్పదం లేదు. ముహూర్తాలు పెట్టే స్వాములవా మాకు పుణ్యం వుంటుంది. ముహూర్తాలన్నిటినీ ఒకటి రెండు రోజులకే పరిమితం చేసి, అందరినీ అవస్థ పెట్టకుండా వాటిని వికేంద్రీకరించండి! మనలో మాట – బ్రహ్మాండమైన ముహూర్తాలన్నీ బ్రహ్మాండమైన శుభ ఫలితాలనిస్తున్నాయా, సాదా సీదా ముహూర్తాలను కున్న పేమన్నా చెడు ఫలితాల నిస్తున్నాయా – చెప్పండి.

ఈ సంవత్సరం నెల్లూరులో యన్.జి.ఓ. అసోసియేషన్ పుణ్యాన దర్గామిట్ట టిటిడికి ఎదురుగా వారిదొక కళ్యాణ మండపం అదనంగా ఏర్పడింది.

* * *

ఈ సంవత్సరం మాఘ మాసః పెళ్లిళ్లన్నీ దాదాపు ఫిబ్రవరి మాసంలోనే మరీ 11, 12 తేదులు టౌన్‌లో నిత్య కళ్యాణం పచ్చ తోరణంగా పండుగ వాతావరణం వెలసింది.

ముత్తుకూరు స్వగ్రామస్తుడు ప్రస్తుతం నెల్లూరు వాసి, పంచాయితీ రాజ్ శాఖలో గ్రామాభివృద్ధి శాఖాధికారిగా, ఆ తరువాత పడుగుపాడు మేజరు పంచాయితీ ఎగ్జిక్యూటివ్ ఆఫీసరుగా విజాయితీగా పనిజేసి రిక్తహస్తాలతో రిటైరైన సౌమ్యుడు, ఫోటోగ్రఫీలో ఎక్స్‌పర్టు అయిన కొట్టెం వెంకట కృష్ణయ్య కుమారుడు రాజశేఖర్; చిట్రగుంట – శ్రీ బచ్చు ఆదిశేషయ్య కుమార్తె సరళ కుమారి వివాహం జనవరి 27 తేది చిట్రగుంట రైల్వే ఇన్స్టిట్యూట్‌లో జరిగింది.

* * *

స్వయం కృషితో, అలుపెరుగని శ్రమతో, అంచెలంచెలుగా అందలమెక్కిన శ్రీమంతుడు, ఇటు కాంట్రాక్టులు, అటు పారిశ్రామిక రంగాలలో సమతుల్యంగా విజయ సోపానాలధిరోహిస్తున్న అదృష్ట జాతకుడు, సిరి కొండపై కూర్చున్నా వినయం, నిగర్వత్వం వదలని సహృదయుడు,నొప్పింపక, తానొవ్వక తప్పించుక తిరిగే ధన్యుడు, పాతకాగులపాడు వాసి, ప్రస్తుతం హైదరాబాదు నివాసి, నెల్లూరు వెంకటరమణ థియేటర్ యజమాని, ప్రియదర్శిని సిమెంట్స్ అధినేత శ్రీ నెల్లూరు రాధాకృష్ణా రెడ్డి తనయుడు, సుజిత్; పట్టిందల్లా బంగారు చేసుకోగలిగిన శ్రామిక సంపన్నుడు నాయుడు దశరథరామిరెడ్డి సోదరుడి దౌహిత్రి, శ్రీ నాయుడు లక్ష్మి నరసారెడ్డి కుమార్తె అఖిల వివాహం 5 తేది టి.టి.డి కళ్యాణ మండపంలో నేత్రానందంగా జరిగింది. టి.టి.డి కళ్యాణ మండపాన్ని అంత సింపుల్ గా, అంత అందంగా అలంకరించవచ్చా అన్పించింది, ఆ పెళ్ళి చూసిన తర్వాత! డాక్టర్ వై.ఎస్ గ్రూపు ఎమ్మెల్యేలు మొత్తం ప్రత్యక్షమైనట్టున్నారు. రాజకీయాలకు తాను చాలా దూరం అంటూనే ఆ రొంపిలో చిక్కుకుపోతుంటారు ఎస్.ఆర్.టి.

* * *

ఎలక్ట్రిసిటీ శాఖలో ఎ.డి.ఇ గా వెంకటగిరిలో పనిచేస్తూ హెమరేజితో అకాలమృత్యువు పాలైన పూలంపేట దశరథరామయ్య పుత్రుడు – అంటే గూడూరు పైరా డిప్యూటీ కలెక్టరుగా రిటైరైన శ్రీ పి.వి. సుబ్బానాయుడు దౌహిత్రుడు – నాగార్జున రావు; నెల్లూరు – శ్రీ వేముల వెంకయ్య నాయుడు పుత్రిక పద్మజ పెండ్లి ఫిబ్రవరి 11 తేది నెల్లూరు టి.వి.యస్. కళ్యాణ మండపంలో జరిగింది.

* * *

కోవూరు వాసి, ఇప్పుడు హైదరాబాదులో స్థిరపడిన శ్రీ తేగపూడి సుందర రామిరెడ్డి కుమారుడు – నిత్య నూతనోత్సాహి, కొత్తదైన పెట్లూరు నిమ్మ పరిశోధనా కేంద్రాన్ని అభివృద్ధిచెందిన ఇతర కేంద్రాల వలె అభివృద్ధి పరుచుటకు నిరంతరం కృషి చేస్తున్న డాక్టర్ యస్. ఈశ్వర రెడ్డి బావమరిది – రాజశేఖర్ రెడ్డి; శ్రీ ఏలూరు వేణురెడ్డి కుమార్తె శోభారాణి వివాహం 11 తేది గూడూరు సుందర మహల్‌లో జరిగింది.

* * *

తోటపల్లి గూడూరు శ్రీ మారంరెడ్డి గోపాలరెడ్డి కుమార్తె రాజీ; ఇరిగేషన్ శాఖలో జూనియర్ ఇంజనీరుగా పనిచేస్తూ గాంధీ జనసంఘం సమీపంలో కలిగిరి రిజర్వాయరుకు వచ్చే కాలువలో ప్రమాదవశాత్తు జీపు తోటి తానూ పడి అన్యాయంగా మృత్యువు పాలైన యువకుడు – నెల్లూరు ఆనం వెంకట సుబ్బారెడ్డి కుమారుడు మహేష్ పరిణయం 11 తేది వి.ఆర్. హైస్కూలులో జరిగింది.

* * *

పుట్టిన వూరు గంగపట్నం, అల్లుడై స్థిరపడిన గ్రామం పురిణి, పనిచేస్తున్నది నెల్లూరు టౌన్ రెవిన్యూ ఇన్స్పెక్టరుగా – నమ్రత, చొరవ, చురుకుదనం కల్గిన శ్రీ రాయసం రాంబాబు కుమార్తె షర్మిల; గూడూరు పంచాయితీ రాజ్ డివిజనల్ కార్యాలయంలో అకౌంట్స్ ఆఫీసరుగా వున్న శ్రీ వాసిలి వెంకట సుబ్బయ్య కుమారుడు, ఇంజనీరింగ్ పట్టభద్రుడు సతీష్ బాబు కళ్యాణం 11 తేది దర్గామిట్టలోని యన్.జి.వో కళ్యాణ మండపంలో అహూత జనసమ్మర్దంగా జరిగింది.

* * *

## నెల్లూరు ముచ్చట్లు

6 పేజీ కొరవ

ఒకటిన్నర సంవత్సరం ఆయుస్సు గలిగిన వ్యయ ప్రయాసలతో కూడిన ఈ మధ్యంతర పదవికి ఎవరు ఆశపడు తారు అని ఒక ప్రశ్న. అమాయకపు ప్రశ్న యిది – ఇప్పుడు ఎన్నికైతే రేపు సిటింగ్ మెంబరుగా అభ్యర్థిత్వానికి హక్కు ఏర్పడదా? అభ్యర్థిత్వాల ఊబలాటాల గూర్చి వివరంగా చర్చించుకోవడానికి ఇది సమయం కాదు.



డాక్టర్ రామచంద్రా రెడ్డి, డాక్టర్ ఇందిరమ్మల తనయ అనిత, శ్రీనివాస్; వీరి వివాహం 18 తేది తిరుపతిలో జరిగింది.

## ఆదాయంలో అర్ధభాగం సిబ్బంది జీతాలకే!

నెల్లూరు మునిసిపాలిటి 1993 - 94 ఆదాయవ్యయాల సంగ్రహ రూపం వెలువడింది. మొత్తం ఆదాయం రూ. 9,36,63,643; మొత్తం ఖర్చు రూ. ౯,౦౯,౦౭౭, ౯౦౭౭లు మిగులు రూ. 6, 76, 727 లు.

ఇక వ్యయం పద్దులు; సిబ్బంది జీత భత్యాలు రూ. 5,23, 66, 000; పారిశుద్ధ్య నిర్వహణ రూ. 39, 20, 000; నీటి సరఫరా, మురుగు నీటి కాల్వల నిర్వహణ రూ. 35, 50, 000; వీధి దీపాలు రూ. 35, 50, 000; డిపాజిట్ల తోటి ఇతర వ్యయం రూ. 1, 39, 53, 000 లు.

రాబడిలో సాధారణ నిధికి లభించే ఆదనపు మొత్తం రూ. 1, 09, 31, 727 పెట్టుబడి పనులకు ప్రభుత్వం నుండి లభించే గ్రాంట్లు రూ. 53, 92, 000 లు అభివృద్ధి; కార్యక్రమాలకు అయ్యే ఖర్చు రూ. 1, 36, 47, 000 లను తీసి వేస్తే 1994 మార్చి ఆఖరుకు మిగిలే నిల్వ రూ. 26, 36, 727 లు

జీతాలకే అవస్థ పడే మునిసిపాలిటికి, ఒక బల్బు చేక్ కొనే గతి లేని మునిసిపాలిటికి మిగులేమిటి అని నవ్వుతారా? - బడ్జెట్ అంటే అంకెల గారడియే గదా!

గమనార్హమైన మరో విశేషం. ఆదాయంలో సిబ్బందికే దాదాపు 55 శాతం సెలవవుతున్నది; బడ్జెట్ మీద సవివరమైన చర్చ తర్వాత –

## ప్రసన్నరెడ్డి తండ్రి మరణం

మహా వటవృక్షం వలె విస్తరించిన మాగుంట వ్యాపార, పారిశ్రామిక సామ్రాజ్యాన్ని ఒంటి చేతితో, విసుగు అలుపన్నది లేకుండా నిర్వహిస్తున్న యువకుడు పని భారం పెరిగే కొద్దీ ఉత్సాహం ఇనుమడించే సమర్థుడు శ్రీ పి.వి. ప్రసన్నరెడ్డి తండ్రి, మానేగుంటపాడు సర్పంచ్, పెద్ద రైతు, మృదు స్వభావి శ్రీ పాలిచర్ల జనార్దన రెడ్డి 27 తేది సాయంత్రం హఠాత్తుగా మరణించారు. ఆయన వయస్సు 66 సంవత్సరాలు. అంత్యక్రియలకు హాజరైన కార్లు, జనంతో మానేగుంట పాడు పట్టలేదు.

జనార్దన రెడ్డి గారికి ఇద్దరు కుమారులు; వారి కుటుంబానికి మా సానుభూతి

## పెద్దాస్పత్రి

( మొదటి పేజీ కొరవ)

ఎన్ని వెళ్లినా బుట్ట దాఖలు చేయించగల సామర్థ్యం వున్నట్లుంది. టెలిఫోన్ పేరుతో, క్వార్టర్ పేరుతో నెలనెలా దొంగ బిల్లులు డ్రా చేస్తున్నారని ఒక ఆరోపణ; చర్య తీసుకునే వారు లేనేలేరు. డ్రగ్స్ కమిటీలు, మెడికల్ బోర్డులు సమావేశమే కావు.

ఆస్పత్రిలో రెండు వర్గాలు; ఇద్దరి మధ్య ఎప్పుడూ పోరాటమే. వారి సమయమంతా ఆ కుస్తీ పట్టుతోనే సరి పోతుంది. ఈ బలుమతో సిబ్బంది సైతం తమ ఇష్టం వచ్చినట్లు ప్రవర్తిస్తున్నారు. అడిగేవారు లేరు. ఈ ఆస్పత్రిలోని ప్రతి డాక్టరుకూ బలమైన రాజకీయ మద్దతులున్నాయి. ఎవరికీ ఎన్నేళ్లు గడిచినా, బదలీలు రావు. ఎమ్మెల్యేలకు, మంత్రులకు అసలు ఆస్పత్రి సంగతే పట్టదు. దీన్ని క్షాళన చేయాలంటే ఆస్పత్రిలో ప్రస్తుతమున్న డాక్టర్లందర్నీ తరలించి, కొత్తవారితో నింపడం ఒక్కటే మార్గం. సూపరింటెండెంట్ పై అసంఖ్యాకంగా వస్తున్న ఆరోపణల పై సమగ్ర దర్యాప్తు జరిపి నిజా నిజాలు తేల్చడం జరగాలి! డాక్టర్ల కీచులాటలో పేషంట్లు బాధ పడడం ఏమి న్యాయం?

## ఐఏఎస్

( మొదటి పేజీ కొరవ)

పట్టుబట్టాయి. కానీ హోం మంత్రి వారి కోరిక మన్నించలేదు.

ఒక సీనియర్ ఐఏఎస్ అధికారిగా వుండి, నైతిక ప్రమాణాల విషయంలో అధఃపాతాళానికి పతనమయ్యే పరిస్థితి ఏర్పడడం దురదృష్టకరం. హెచ్ కె బాబు వంటి వారి నీచ కృత్యాల వల్ల మొత్తం ఐఏఎస్ అధికారుల పరువే పోతున్నది. బజారులో పరాయి ఆడవారితో విచ్చలవిడిగా తిరిగే వ్యక్తిని ప్రభుత్వ పాలనాధికారిగా పరిగణించి, గౌరవించ వలసి రావడం నిజంగా ప్రజలు చేసుకున్న దురదృష్టం. అటువంటి అధికారుల పై చర్య తీసుకోవడానికి భయపడే ప్రభుత్వాలు మన కుండడం కూడా మన దౌర్భాగ్యమే!

ఇదిట్లా వుంటే తాజాగా తెలుస్తున్న సమాచారం ప్రకారం హెచ్‌కెబాబు, మింజాలా వారిరి రాజీపడి పోయారని చెప్తున్నారు. ఇద్దరి మధ్య ఏ అంగీకారం కుదిరిందో కాని, ఇద్దరూ తమ తమ కేసులు విత్‌డ్రా చేసుకో బోతున్నారట. కేసులు లేకుండా పోయినంత మాత్రాన ప్రజల్లో చర్చకు వచ్చిన ఈ వివాదం ఎట్లా సమసి పోతుంది? పోయిన పరువెట్లా తిరిగి వస్తుంది?

# విజయమహల్ బ్రిడ్జికి ఇకనైనా మోక్షం కలుగుతుందా!

విజయమహల్ రైల్వేగేటు వద్ద వాక్సు పైన బ్రిడ్జి నిర్మాణానికి నెల్లూరు మునిసిపాలిటీ, రైల్వేశాఖకు 10 లక్షల రూపాయలు చెల్లించింది. గతంలో చెల్లించిన మొత్తంతో కలుపుకొంటే అది 20లక్షల 55 వేలకు చేరింది. ఫిబ్రవరి 25తేది చెల్లించిన 10లక్షలు నెల్లూరు ఎమ్మెల్యే శ్రీ జె.కె.రెడ్డి నియోజక వర్గ అభివృద్ధి కోసం మంజూరైన తన నిధుల కోటా నుండి ఇచ్చారు. బ్రిడ్జి నిర్మాణానికి 30లక్షల 64 వేలు ఖర్చు అవుతుందని అంచనా లో పేర్కొనగా 20 లక్షల మీద చెల్లిస్తే నిర్మాణపు పని మొదలు పెడతామని రైల్వే అధికారులు ఇంతకు ముందు చెప్పి వున్నారు.

## సెంట్రల్ స్కూల్ వార్షికోత్సవం

విద్యార్థుల్లో క్రమశిక్షణ, దేశభక్తి, దైవభక్తి పెంపొందింప వలసిన బాధ్యత ఉపాధ్యాయ లతో పాటు తల్లి తండ్రులపై కూడు వుందని ప్రముఖ నటీమణి శ్రీమతి జమున అన్నారు. 27తేది న ఆపరేటివ్ సెంట్రల్ బ్యాంక్ ఆవరణ లో అట్టహాసంగా జరిగిన నెల్లూరు సెంట్రల్ స్కూల్ పదవ వార్షికోత్సవ సభలో ఆమె ముఖ్య అతిథిగా పాల్గొని ప్రసంగించారు. సమాజంలో పరిస్థితులు నానాటికి పతనమై పోతున్న ఈ రోజుల్లో విద్యార్థులు కూడా పక్కత్రోవ పట్టి పోతే ఆ పరిస్థితి ఊహించ లేమన్నారు. సభా ప్రారంభంలో కె.వి.భాస్కరరావు తనదైన

## నెల్లూరు సంగతులు

### ముగిసిన క్రికెట్ పోటీలు

ఫిబ్రవరి 22తేది నుండి ఎ.ఆర్.సి గ్రౌండ్ లో జరిగిన శ్రీనివాస తేజ మెమోరియల్ క్రికెట్ పోటీలు 28 తేది ముగిసాయి. యువతలో క్రేజీ క్రీడగా మారివున్న క్రికెట్ పై దివంగతుడైన తన కుమారుడు శ్రీనివాస తేజ స్మారకార్థం నాయుడుపేట మాజీ మండలాధ్యక్షుడు చదలవాడ కృష్ణమూర్తి ఈ పోటీలను ఏర్పాటు చేసారు. గెలుపొందిన జట్లకు బహుమతి అందజేయను ఏర్పాటు చేసిన సభలో నెల్లూరు ఎమ్మెల్యే జె.కె.రెడ్డి, సింహపురి సేవాసమితి కన్వీనర్ ఆనం వివేకానంద రెడ్డి, డాక్టర్ జె.వి.రెడ్డి తదితరులు పాల్గొన్నారు. ఈ సందర్భంగా ఎమ్మెల్యే జె.కె.రెడ్డి మాట్లాడుతూ ఇంతకుముందు టౌన్‌లో క్రీడల పోటీలు తరచుగా జరుగుతుండేవి కాని అవి తగ్గుముఖం పట్టడం దురదృష్టకర మన్నారు. తన కుమారుని పేర జరిగిన క్రీడోత్సవంలో మాట్లాడడం మరువలేని మధురానుభూతని చదలవాడ కృష్ణమూర్తి చెబుతూ టౌన్‌లో ఎలాంటి క్రీడోత్సవాన్ని నిర్వహించినా చేయూత నిస్తానని హామీ ఇచ్చారు. అనంతరం క్రికెట్ పోటీల్లో ప్రథమ స్థానం లో నిలచిన కపిల్ లెవన్స్ జట్టు కెప్టెన్ కోటారెడ్డి, ద్వితీయ స్థానంలో నిలచిన రాయల్ క్రికెట్ క్లబ్ కెప్టెన్ కొండా కనక రాజులకు బహుమతులందజేసారు. బెస్ట్ బాట్స్‌మెన్ గా కొండా కనకరాజు, బెస్ట్ బౌలర్‌గా సయ్యద్ సమీర్ బహుమతులు పొందారు. బహుమతి ప్రదాన కార్యక్రమం ఆహ్లాద భరిత వాతావరణంలో జరిగింది.

బాణీలో కొనసాగించిన వుపన్యాసంలో విద్యార్థులకు వుపయోగపడే పలు సూచనలు చేసారు. మాజీ శాసనసభ్యుడు కె.వి.సుబ్బారెడ్డి, సీనియర్ అడ్వకేట్ టి. సుందర రామరెడ్డి, జిల్లా కాంగ్రెస్ కమిటీ ప్రధాన కార్యదర్శి సి.హెచ్.దేవకుమార్ రెడ్డి పాల్గొని విద్యార్థినీ, విద్యార్థులకు బహుమతులంద జేసారు. స్కూల్ ప్రిన్సిపాల్ శ్రీ కె.ఎస్. రావు ఆహూతులకు స్వాగతం పలకడంతో పాటు వందన సమర్పణ చేశారు. సభానంతరం జరిగిన సాంస్కృతిక కార్యక్రమాలు సభికులను ఆకట్టుకొన్నాయి.

### జ్ఞాతీయ సైన్స్ దినోత్సవం

టౌన్ లోని సొసైటి ఆఫ్ సైన్స్ ఫర్ పీపుల్ సంస్థ జాతీయ సైన్స్ దినోత్సవం ఫిబ్రవరి 28తేది సాయంత్రం టౌన్ హాల్ రీడింగ్ రూమ్ లో జరిపింది. సభకు ముఖ్య అతిథిగా విచ్చేసిన డి.కె.డబ్ల్యు కాలేజి ఫిజిక్స్ లెక్చరర్ డాక్టర్ బి. కామేశ్వరరావు ప్రసంగిస్తూ భారతీయ శాస్త్రవేత్త సర్ సి.వి.రామన్ ప్రతిష్ఠాకరమైన పరిశోధనలు జరిపి ప్రపంచంలో దేశ కీర్తిని అగ్ర స్థానంలో నిలబెట్టారన్నారు. అధ్యక్షించిన సంస్థ అధ్యక్షుడు డాక్టర్ ఎ. జగదీష్ వైజ్ఞానిక రంగ అభివృద్ధికి సంస్థ చేపడుతున్న కార్యక్రమాలు వివరించారు. సైన్స్ డే సందర్భంగా నిర్వహించిన వివిధ పోటీల్లో గెలుపొందిన విద్యార్థినీ, విద్యార్థులకు జనమద్దిపాళెం గవర్నమెంటు జూనియర్ కళాశాల ప్రిన్సిపాల్ డాక్టర్ జి.రాజకుమారి బహుమతు లందజేశారు. చివరన సొసైటీ కార్యదర్శి పి.వి.లావణ్యారావు వందనాలు చెప్పారు.

Statement about ownership and other particulars about the News Paper

**ZAMINRYOT** (Telugu Weekly)

Nellore - 524 004 -- Andhra Pradesh

**Form IV (See Rule 8)**

| | | |
|---|---|---|
| 1. | Place of Publication | : 3rd Cross Street, Savithri Nagar, NELLORE - 524 004. (AP) |
| 2. | Periodiicty of Publication | : Weekly |
| 3. | Printer's Name, Nationality & Address | : N. Dolendra Prasad, Indian, CAM Compound Bdgs, Near State Bank, NELLORE — AP |
| 4. | Publisher's Name, Nationality & Address | : — do — |
| 5. | Editor's Name, Nationality & Address | : — do — |
| 6. | Name and Address of the individuals who own the news paper and partners of Share Holders holding more than one percent of the total capital: | |

**Zaminryot Committee:**

| | | |
|---|---|---|
| 1. | Sri N. Sreeramamurthy, Military Colony, (Opp: LIC) NELLORE - 524 003. | : President |
| 2. | Sri T. Vanamali, Near Little Flower School, NELLORE - 524 004. | : Secretary |
| 3. | Sri N. Dolendra Prasad, CAM Compound Bdgs., Near State Bank, NELLORE - 524 003. | : Member |
| 4. | Sri N. Kosal Ram, No. 8, Sriram Colony, Abhiramapuram, MADRAS - 600 018. | : Member |
| 5. | Sri N.Yaminchandra, Andhra Bank, NELLORE - 524 003. | : Member |

I N. DOLENDRA PRASAD here by declare that the particulars given above are true to the best of my knowledge and belief.

**N. DOLENDRA PRASAD, Publisher**

## శివారెడ్డి పద్యాలు

### నిర్యాణం

శ్రీనివాసులురెడ్డి చెయి జారి పోయ్యారు
కాలవాహినిలో గలిసినారు
మాజీ మంత్రి అయ్యె!
మటుమాయమైపోయె
యింతలోనె, యముడు గొంతు గోసె!

ఉండదగినవారు వుంటుండి, పోదగ్గ
వారుబోతె ఎవరు వగవబన్న
మంచి పెద్ద మట్టు మర్యాద కలవ్యక్తి
జారిపోతె గుండె జలదరిసద్ది!

కవిని నేను దార్ల కవిపస్తె కారాపి
పలుకరించి ప్రేమ వొలక బోసె
వాడు, యింక పుట్టబోడు అంతటోడు
పాలిటిక్సు దాంతో పన్లె కవికి!

పుట్టినోడు తిరిగి పొయ్యేది ఖాయమ్ము!
శ్రీనివాసు రెడ్డి వేరె చివరి!
పోయిన వారు తిరిగి పుట్టిది యుగలేరు.
చింతపడకు చంద్రశేఖరయ్య!

### పెళ్ళిళ్ళు

పెళ్ళిళ్ళకు రాలేదని
పళ్ళు కొరుకుతారు చుట్ట పక్కాలెల్ల
ఎట్లా? రామా పోనూ
బళ్ళఛార్జీ? అరవరాని బాధర తండ్రి!

విప్ర సొమ్ము కంటె విసముమేలంటుంది
బమ్మెరపోతు రాజా భాగవతము.
శూద్ర పక్షి పొత్తు సొమ్ము క్షీరాన్నమ్ము.
పంచదార. ఏమి పార్టీ!

## సణుగుడు

(4 పేజీ తరువ)

సరికి మొదలుతో సహా విరిగి క్రింద పడ్డాయి; పొద్దెక్కి, సరికి కొమ్మలు రెమ్మలతో సహా రంపపు కోతకు ముక్కలు చెక్కలైనాయి; పొద్దు గూకే సరికి ఆనవాళ్లు కన్పించకుండా వేళ్లతో సహా కాలి బూడిదైపోయాయి. దారిన పోయే జనం పట్టించు కోలేదు; రోజూ ఆ దారిన వెళ్లే కలెక్టరు, జాయింట్ కలెక్టరాది ఉన్నతాధికార్ల దృష్టిలో ఇది పడనేలేదు; మునిసిపాలిటీకి తెలియలేదు; ఆర్ అండ్ బి అధికార్లకు అసలే కన్పించలేదు.



ప్రకృతి పరిరక్షణా సంకల్పంతో చెట్ల విధ్వంసాన్ని ఆపడానికి ప్రభుత్వం చాలా కఠినమైన శాసనమే చేసి వుంది. దాని ప్రకారం చెట్టు తొలగించాలంటే కలెక్టరు అధ్యక్షతన అటవీ శాఖ, ఆర్ అండ్ బి, మునిసిపాలిటీ, రెవిన్యూ అధికారులు సభ్యులుగా కల్గిన కమిటీ దాని అవసరాన్ని నిర్ధారించాలి; అనుమతి ఇవ్వాలి. అది లేకుండా నరికితే జైలు శిక్ష కూడా విధించవచ్చు; చట్టం ఇంత పకడ్బందీగా వున్నా చెట్లకు రక్షణ కలగడం లేదు; చట్టం వుందని హత్యలు, మానభంగాలు, దోపిడీలు, ఆగుతున్నాయంటారా — అది నిజమే కదా!

రోడ్ల ప్రక్క చెట్లు లేకుండా పోయి టౌన్‌లో నివాసం దుర్భరమై పోతుంది. కాంక్రీటు భవనాలు ఎంతను పెర్చి, హాల్ ఫ్యాక్టరీ వలె పనిచేసి, రేడియేషన్‌ను కొట్టికొట్టి వదలి, జనం వంట్లోని నెమ్ము ఆ... కొత్తగా చెట్లు పెంచడం ఎటూ మనకు చేతకాదు — కనీసం వున్న వాటినైనా కాపాడుకోకుంటే ఎట్లా?

## పంచాంగము

### ముహూర్తములు

తేది 7 ఆదివారము ఉదయము 7.16 గంటలకు మీన లగ్నమున వివాహములకు

తేది 10 బుధవారము ఉదయము 7.10 గంటలకు మీన లగ్నమున గృహారంభ ఉపనయన వివాహములకు రాత్రి 7.22 గంటలకు కన్యాలగ్నమున గృహ ప్రవేశ వివాహములకు సుముహూర్తములు కలవు

### మార్చి తిథులు

ఫాల్గుణ శుద్ధ

తే 6 శని త్రయోదశి రా.గం.8.41 వ
తే 7 ఆది చతుర్దశి రా.గం.6.28 వ
తే 8 సోమ పూర్ణిమ సా.గం.4.06 వ

ఫాల్గుణ బహుళ

తే 9 మంగళ పాడ్యమి మ.గం.1.40 వ
తే 10 బుధ విదియ మ.గం.11.15వ
తే 11 గురు తదియ మ.గం.9.10 వ
తే 12 శుక్ర చతుర్థి మ.గం.8.[illegible] వ

స్వయంపాకుల శ్రీనివాసులు
ఎం.ఏ

# అజరుద్దీన్ చిరంజీవి అభిమాని!

ఇటీవల మద్రాసులో క్రికెట్ మ్యాచ్ ముగిసిన సందర్భంలో కెప్టెన్ అజారుద్దీన్ ను "మీ అభిమాన సినిమా హీరో ఎవరు?" అని అడిగితే, కాస్సేపాగి "చిరంజీవి." అని జవాబిచ్చారు.

## ఐశ్వర్య అమ్మమ్మ

ఐశ్వర్య తల్లి నటి లక్ష్మి నుంచి వేరు పడ్డప్పట్నుంచి ఆమెకు తోడుగా ఆమె అమ్మమ్మ షూటింగులకు వస్తున్నది. ఆమె పేరు రుక్మిణి. ఒకప్పుడు "శ్రీవల్లి, మంజరి" వంటి చిత్రాలలో నాయికగా నటించింది. ఈమెను ఐశ్వర్య "రుక్మిణి అనీ, రుక్కూ " అని పిలుస్తూంటుంది. "అమ్మమ్మని అలా పేరెట్టి పిలవచ్చా?" అని ఐశ్వర్య తో అంటే, "ఆమె నాకు అమ్మమ్మ కాదు; ఆత్మీయురాలు. ఆత్మీయురాల్ని పేరుతో పిలిస్తే ఏం?" అంటూ అమ్మమ్మ వంక తిరిగి, "అవును కదూ రుక్కూ!" అంటే, ఆ అమ్మమ్మ తప్పేమీ లేదంటూ మందహాసం చేస్తుంటుంది!



తెలుగు అగ్ర సినీ హీరో త్రయం రాజశేఖర్, బాలకృష్ణ, నాగార్జున

# జయప్రద ధీమా!

జయప్రద మామగారు సుందర్‌లాల్ నహతా మృతికి సానుభూతి చెప్పడానికి వెళ్ళినప్పుడు ఆమె ఉల్లాసంగానే కనిపించారు. అందుకు కారణమేమిటో తర్వాత తెలిసింది. "పదేళ్ళ తర్వాత నేను నటించిన తమిళ చిత్రం 'ఏ హై జాతి' సూపర్‌హిట్ గా ఆడుతోంది. ఆర్టిస్టుగా నాకు ఇంతకన్నా ఆనందం మరేముంటుంది? ఆ చిత్రంలో నా పాత్ర -మానవసేవ చేసే ఎం.ఎల్.ఎ. తిలకవతి. ఇది నా మనః ప్రవృత్తికి దగ్గరగా ఉన్నందున ఒప్పుకున్నాను," అంది. (కాని, ఆమె నటనా కౌశలాన్ని ప్రదర్శించడానికి తగిన పాత్ర కాదని పలు తమిళ పత్రికలు సమీక్షల్లో పేర్కొన్నాయి).

ఆమె మళ్ళీ చెప్తూ " హిందీలో నా స్థానం పదిలంగా ఉంది. ఏడు చిత్రాల్లో ఇప్పుడు చేస్తున్నాను. ఒక దానిలో అమితాబ్ బచ్చన్ హీరో. తమిళంలో ఇంకా చాలా అవకాశాలు వస్తాయనే నమ్మకం నాకుంది. 200 చిత్రాలలో నటించిన నాకు ఖ్యాతి, అంతస్తు ఉన్నాయి. కాని, మాతృభాష అయిన తెలుగులో నటించడం లేదే అనే బాధ లేక పోలేదు". అంది.

కొరవ 11 పేజీలో

# ఆశ్లీల చిత్రాల పై ఆడవాళ్ల యుద్ధం!

## — జమున పిలుపు

సమాజంలో మహిళలపై జరిగే అత్యాచారాలకు కారణమైన బూతు సాహిత్యం, అశ్లీల, హింసాత్మక సినిమాలపై మహిళలు వుద్యమించక తప్పదని ప్రముఖ సినీనటి శ్రీమతి జమున అన్నారు. ఫిబ్రవరి 28తేది ఆంధ్రప్రదేశ్ రంగస్థల వృత్తి కళాకారుల సమాఖ్య సమావేశం లో పాల్గొనను వచ్చి ఇందిరాభవన్ లో పత్రికల వారితో మాట్లాడారు. సమాజంలో మహిళలపై జరిగే అరాచకాలకు బూతు సాహిత్యం, అశ్లీల హింసాత్మక సంఘటనలతో నిర్మించే పరమ అధ్వాన్నపు సినిమాలే కారణం. దేశం లోని సెన్సార్ వ్యవస్థ నిర్వీర్యమై పోయింది; మంచి సినిమాల కోసం మహిళలే నడుంకట్టాలని చెబుతూ, దీని కోసం అశ్లీల సినిమాలను బహిష్కరించడం, ఈ సినిమాలు ప్రదర్శించే హాళ్ల వద్ద నిరాహార దీక్షలు చేపట్టడం వంటి నిర్మాణాత్మక కార్యక్రమాలు చేపట్టను రాష్ట్రం లోని మహిళా సంఘాలు ముందుకు రావాలని పిలుపిచ్చారు. సారా వుద్యమం ప్రస్తుతం రాజకీయ పరమైనా, అది సమాజ పరంగా వచ్చిన చైతన్య మవడం వల్ల సారా నిషేధించాలన్నారు.

రాష్ట్ర వ్యాప్తంగా వున్న 5లక్షల మంది వివిధ రకాల కళాకారులు అత్యంత దుస్థితి లో వున్నారని, గత ప్రభుత్వపు హయాంలో వారు అధఃపాతాళానికి దిగజారారని. కాంగ్రెస్ ప్రభుత్వం అధికారం లో వున్నందున వారిని ఒప్పించి కళాకారుల పట్ల శ్రద్ధ వహించి, సంక్షేమ కార్యక్రమాలు చేపట్టేలా కృషి చేయగలనని శ్రీమతి జమున చెప్పారు.

## నెల్లూరు లో పౌరాణిక చిత్ర బ్రహ్మ

"నర్తనశాల, పాండవ వనవాసం" వంటి బహుజన ప్రశంసలందుకున్న చిత్రాలకు దర్శకత్వం నెరపిన 'పౌరాణిక చిత్ర బ్రహ్మ' కమలాకర కామేశ్వరరావు తన 70వ ఏట "ఏడుకొండల స్వామి" చిత్రాన్ని ప్రతిభావంతంగా రూపొందించిన విషయం అందరికీ తెలిసిందే. ఇతర దర్శకుల్లాగా ఈయన తన రేటును ఎప్పుడూ పెంచలేదు. పారితోషికం ఇస్తే పుచ్చుకొనేవారే గాని, ఇవ్వకపోతే నిర్మాతలను అడిగేవారు కాదు. అందుకే మద్రాసు లో ఉన్నంతకాలం అద్దె ఇంట్లోనే గడిపారు. ఇప్పుడు పౌరాణిక చిత్రాలకు కాలం చెల్లింది గనుక, ఆయన మద్రాసులో జీవయాత్ర సాగించలేక నెల్లూరులో తన పుత్రుడి ఇంటికి చేరుకున్నారు. ఈయన ఆదిలో కొన్ని సాంఘిక చిత్రాలకు కూడా దర్శకత్వం నెరపారు.

సెక్సు, హింస, మితి మీరిన ఇప్పటి సాంఘిక చిత్రాల స్థాయికి దిగజారలేరు గనుకే ఈ నిర్ణయం తీసుకున్నారేమో!

# రీమేక్‌కు రాయితీలు లేవు

ఇతర భాషలలో కాస్త విజయవంతమైతే సరి-హక్కులను కొని మన వాళ్ళు తెలుగులో పునర్నిర్మిస్తున్నారు. వాస్తవానికి "రాజేంద్రుడు-గజేంద్రుడు" చిత్రం ఒక కన్నడ చిత్రం ఆధారంగా నిర్మింపబడింది. ఆ విషయం ఆ చిత్రం పబ్లిసిటీ లో ఎక్కడా పేర్కొనబడలేదు. ఇటీవల చాలామంది తెలుగు నిర్మాతలు తమ చిత్రాలను కన్నడంలో పునర్నిర్మించారు. వాళ్ళ ధాటికి కన్నడ చిత్ర పరిశ్రమ బాగా దెబ్బతిన్నదని కన్నడ చిత్ర నిర్మాతలు ప్రభుత్వానికి మొరపెట్టుకున్నారు. ఫలితంగా ఇతర భాషా చిత్రాలు కన్నడంలో పునర్నిర్మింపబడితే వాటికి రాయితీలు ఉండవని ఇటీవల కర్నాటక బడ్జెట్ -లో పేర్కొనబడింది. కన్నడ నటీనటులకు అడ్వాన్సులు చెల్లించి, కర్నాటకలో షూటింగ్‌లు చేసుకోవడానికి సిద్ధమైన ఎందరు తెలుగు నిర్మాతలు ఇక ఆ ప్రయత్నాలకు తిలోదకాలు ఇవ్వక తప్పింది కాదు. మన రాష్ట్రంలో కూడా రీమేక్ ల విషయంలో ఇలాంటి నిర్ణయం తీసుకుంటే బాగుండేలా ఉంది. తమిళ,మలయాళ, కన్నడ చిత్రాల హక్కులకు మన నిర్మాతలు పోటీలు పడి, అత్యధిక మొత్తం చెల్లిస్తున్నారు. ఇటీవల 16 లక్షలు పోసి కొన్న ఒక మలయాళ చిత్రం తెలుగులో తుస్సుమంది.ఈ విధంగా మన వారి సొమ్ము ఇతర రాష్ట్రాలకు చేరుతోందని ఎవ్వరూ ఎందుకు ఆలోచించరో విడ్డూరంగా ఉంది. ఇతర రాష్ట్రాలలో షూటింగ్ లు జరపరాదు గాని, ఆ రాష్ట్రాల కథలను మాత్రం తెలుగులో తీయవచ్చు. ఇదేం న్యాయం? విజ్ఞులు ఆలోచించాలి.

## పి.సి.రెడ్డి దర్శకత్వంలో కొత్త చిత్రం

రసవత్తరమైన కుటుంబ గాథలను ప్రతిభావంతంగా తెరకు మలచడంలో నెల్లూరీయుడు పి.చంద్రశేఖర రెడ్డి దిట్ట. ఎందుచేతో ఈ మధ్య ఈయనకు ఎక్కువ చిత్రాలు లేవు. ఒరియా,బెంగాలీ భాషల్లో హిట్ అయిన "మా" అనే చిత్రం హక్కులను కొన్న వై.అశోక్ రెడ్డి, దర్శకత్వ భారాన్ని పి.సి.రెడ్డికి అప్పగించారు. పాత్రధారుల ఎన్నిక జరిగిన అనంతరం చిత్రీకరణ మొదలవుతుంది.

# బడ్జెట్

(4 పేజీ కొరవ)

అనుమతి అవసరం లేదు. ఎగుమతులను అంతా పెంచడానికి, ప్రతి బ్యాంకూ తన అప్పుల మొత్తంలో కనీసం 10 శాతం ఎగుమతి దారులకు ఇవ్వాలని నిర్దేశించారు. వడ్డీ రేటు వారికి ఒక శాతం తక్కువ. వడ్డీ పై పన్ను రద్దవుతుంది.

ఈ మార్పుల వల్ల అంతర్జాతీయ బజారులో రూపాయి అమ్మకానికి విలువైన కరెన్సీగా మారింది. చట్టంలో మరి కొద్ది మార్పులు చేస్తే భారత దేశపు క్రెడిట్ కార్డులు అమెరికాలో కూడా చెల్లుబాటౌతాయి. డాలర్ల బదులు రూపాయి నోట్లతో విదేశీ ప్రయాణాలు చేసే రోజా వచ్చేస్తుంది.

## కస్టమ్స్ పన్నులకు వూహించని కోత!

ప్రభుత్వానికి ప్రధాన ఆదాయ వనరు - పరోక్ష పన్నులే. అవి రెండు భాగాలు; ఒకటి కస్టమ్స్. రెండు ఎక్సైజ్! మొత్తం పన్నుల ఆదాయంలో వీటి భాగం 40 శాతం (18+22). ఎక్సైజ్ అంటే దేశంలో తయారయ్యే వస్తువుల పై పరిశ్రమలలో విధించే పన్ను; కస్టమ్స్ అంటే విదేశాల నుంచి వచ్చే దిగుమతుల పై విధించే పన్ను. ఎంతో ఘనంగా కన్పడే ఐన్‌కంట్యాక్స్ ద్వారా వచ్చేది కేవలం ఆరు శాతం మాత్రమే. దాన్ని బట్టే ఈ రెండు పన్నుల ప్రాధాన్యత అర్థం చేసుకోవచ్చు. అయినా కస్టమ్స్‌లో 3273 కోట్లు, ఎక్సైజ్‌లో 2249 కోట్లు పన్నులు తగ్గించేశారు.

కార్ల నుంచి, టూత్ పేస్టుల వరకు ట్రాక్టర్ల నుంచి జనప చీలల వరకు ఇంతింత ధరలు పెరగడానికి ప్రధాన కారణం ఈ రెండు పన్నులే. యంత్రాలకు వాడే ఇనుము, అల్యూమినియం వంటి లోహాల పై 60 నుంచి 110 శాతం కస్టమ్స్ పన్ను వుంటే, తయారైన పరికరాల పైన 11 నుంచి 23 శాతం వరకు ఎక్సైజ్ వుంటుంది. దీన్ని బట్టే అర్థం చేసుకోవచ్చు - వస్తువు అసలు ధర, అమ్మకం ధరలకు తేడా! ఈ బరువును తగ్గించడానికి లోహాల పైన 20 నుంచి 30 శాతం కస్టమ్స్ తగ్గించారు. యంత్రాల పై 14 శాతం తగ్గించి - గరిష్ట పన్ను 10 శాతంగా నిర్ణయించారు. విద్యుత్ రంగంలోని యంత్రాలకు దీన్ని కేవలం 5 శాతం చేశారు.

విదేశాల నుంచి దిగుమతి చేసుకునే యంత్రాల పై ఇది వరకు 150 నుంచి 200 శాతం పన్ను వుండేది. గత ఏడాది దీన్ని 55 శాతానికి తగ్గించారు. ఇప్పుడు కేవలం 35 శాతంగా నిర్ణయించారు. యంత్ర పరికరాలు దిగుమతి చేసుకొని, ఇక్కడ మెషిన్లు రూపొందించే స్వదేశీ పరిశ్రమలకు దెబ్బ తగలకుండా వారికి పన్ను తగ్గించి 25 శాతం చేశారు. కంప్యూటర్లు, టెలివిజన్ల వంటి ఎలక్ట్రానిక్ పరికరాల పై కూడా పన్ను విపరీతంగా తగ్గి పోయింది. సినిమా రీళ్లు కూడా అంతే.

వీటన్నింటి కంటే విశేషమైనది - విదేశాల నుంచి వచ్చే భారతీయులు తమ తోట తెచ్చుకొనే వస్తువుల పై 255 శాతంగా వుండిన పన్నును 150 కి తగ్గించారు. దీని వల్ల విసిఆర్‌లు, టేప్ రికార్డర్ల వంటి వాటి స్మగ్లింగ్ తగ్గి పోతుంది!

కస్టమ్స్ సుంకాల తగ్గింపు వల్ల భారత పారిశ్రామిక వేత్తలు ప్రపంచంలో లభించే అత్యాధునిక యంత్ర పరికరాలు, సాంకేతిక పరిజ్ఞానం సులువుగా దిగుమతి చేసుకొని పరిశ్రమలు లాభసాటిగా నడిపే వీలు కల్గుతుంది. పరిశ్రమలు పెరిగితే ఉద్యోగాలు దొరుకుతాయి; ప్రజల జీవన ప్రమాణం పెరుగుతుంది.

## కార్లు కారు చవక

మధ్య తరగతి కుటుంబీకులు వాడే వివిధ ఉపకరణాలైన కార్లు, ఏసిల పైన విపరీతమైన రీతిలో పన్ను తగ్గించేశారు ఆర్థిక మంత్రి. కార్ల పైన పన్ను 15 శాతం తగ్గింది. దీని వల్ల మారుతి కారు 16 వేలు, అంబాసిడర్ 15 వేలు ధర తగ్గాయి. మారుతి 1000 ధర 36 వేలు తగ్గుతుంది. లారీలూ అంతే. ఆటో మొబైల్ రంగంలోని ఆర్థిక మాంద్యాన్ని నివారించడానికి ఈ చర్య తీసుకున్నారు. కారు విలాస వస్తువనేది పాత మాట. ఆధునిక రవాణావసరాలకు అది తప్పనిసరి. పై పెచ్చు ఆర్థిక మాంద్యంతో ఆ రంగం దెబ్బతింటే, దాని పై ఆధారపడి వుండే స్టీలు, ప్లాస్టిక్ టైర్ల పరిశ్రమలు మూత పడ్తాయి. కొన్ని వేల మంది ఉద్యోగాలు కోల్పోతారు ఆ ప్రమాదాన్ని నివారించడానికి ఈ పన్ను తగ్గింపు తప్పినట్లు లేదు. రెండేళ్ల క్రితం అమెరికాలో ఇదే పరిస్థితి నెలకొన్నది. జపాన్ కార్లతో పోటీకి తట్టుకోలేక ఫోర్డు వంటి కంపెనీలు మూత పడే పరిస్థితి వచ్చింది.

టెలివిజన్లు, రెఫ్రిజిరేటర్లు, ఎయిర్ కండిషనర్లు, ఫ్యాన్లు టూత్ పేస్టులు, సబ్బులు, షాంపులు సూట్ కేసులు, డన్‌లప్ పరుపులు, పళ్లతోమే పొడి, పేనా ఇంకులు, షేవింగ్ క్రీంలు, పౌడర్లు వగైరా వగైరా లన్నింటినీ పన్ను కోరల నుంచి తప్పించి వేశారు. ఆఖరుకు ఇళ్ళలో వాడే ఎలక్ట్రిక్ బల్బులు, స్విచ్‌లు, బ్యాటరీలు కూడా ధరలు తగ్గుతాయి. చిప్స్, నూడిల్స్ బిస్కట్లు చవకై పోతాయి. కలర్ టీవీలు వెయ్యి నుంచి 3 వేలు, ఏసిలు 3 నుంచి 6 వేలు ధర తగ్గుతాయి. రేడియోలు, టేప్ రికార్డర్లూ అంతే! మధ్య తరగతి వారికి ఇంతకంటే మెరుగైన బడ్జెట్ మరొకటి వుండదు.

## కాఫీ, టీ ఫ్రీ

కాఫీ, టీ పొడుల పై పూర్తిగా పన్ను తీసేశారు. డాల్డా మీద కిలోకు 40 పైసలు పన్ను తగ్గింది. చిన్న పరిశ్రమలలో తయారయ్యే చెప్పుల మీద పన్ను ఎత్తివేశారు. దానివల్ల ఒక జత చెప్పుల ధర రకాన్ని బట్టి 10 నుంచి 100 రూపాయలు తగ్గింది.

## వ్యవసాయానికి పెద్దపీట

పరిశ్రమల రంగం పై ఏ విధంగా రాయితీల వర్షం కురిపించాడో, వ్యవసాయ రంగానికి అదే తీరులో పెద పీట వేశాడు ఆర్థిక మంత్రి. వ్యవసాయానికి కేటాయింపులు 1408 నుంచి 1981 కోట్లకు (30 శాతం అదనం) పెరిగాయి. వ్యవసాయానికి సంబంధించిన ఏ పరికరమైనా, మందైనా, విత్తనాలైనా ఏ దేశం నుంచైనా అతి తక్కువ పన్నుతో దిగుమతి చేసుకోవచ్చు. వరినాటె యంత్రం పైన 25 శాతం పన్ను తగ్గింది. ట్రాక్టర్ల పై 7 నుంచి 8 శాతం వరకు తగ్గింది. వ్యవసాయ రంగాన్ని యాంత్రీకరించే ప్రయత్నానికి ఇది నాంది పలుకుతుంది.

కోళ్లకూ రాయితీల మేత తిన్పించారు. రైతులకు అప్పులిచ్చేందుకు నబార్డ్ ద్వారా 16,500 కోట్లు కేటాయించారు. ఇది గతంలో కంటే 2700 కోట్లు ఎక్కువ.

(కొరవ పై వారం)

## నెల్లూరు 3 వ అ.ము. కోర్టులో

E.P. 288 of 87 in OS 225 of 82

శ్రీ వాగేశ్వరస్వామి దేవస్థానం, పూటుకూరు రిప్రజెంటెట్ బైది మేనేజర్

- Dhr/ వాది

1. చిల్లకూరు సుభాషిణి, 2. చిల్లకూరు రాధాకృష్ణారెడ్డి, 3. చిల్లకూరు శ్రీనివాసులు రెడ్డి

- JDrs/ ప్రతివాదులు

18.3.93తేది పై కోర్టులో ఉదయం 10 గంటల నుంచి సాయంత్రం 5 గంటలలోగా ఈ క్రింది పెద్యూలు దాఖలా స్థిరాస్తిని బహిరంగముగా వేలము వేయబడును. పాడతలచిన వారు పాడుకొనవచ్చును.

ఆస్థివివరము: నెల్లూరు రి.డి. తాలూకా ఇందుకూరు పేట సబ్.రి. ఏరియాలోని ముదివర్తిపాళెం గ్రామంలో మాగాణి పొలం వివరం.

| లాటు. నెం. | పట్టా. నెం | సర్వేనెం. | విస్తీర్ణం ఎ. సెంట్లు |
|---|---|---|---|
| 1 | 16 | 30C | 0-10 |
| 2 | 16 | 30-E1 | 0-04 |
| 3 | 140 | 30-H | 0-41 |
| 4 | 178 | 43-A | 0-66 |
| 5 | 16 | 43-F1 | 0-12 |
| 6 | 13 | 43-F2 | 0-34 |
| 7 | 16 | 43-G | 0-68 |

కుల్లు 2.35 సెంట్లు హద్దులు: తూ. చిల్లకూరు పిచ్చిరెడ్డి మరియు కాటూరి రమణయ్యల భూమి.

ద.ప: పారుదల కాలువ, ఉ. వాగూరు సుబ్బమ్మ భూమి.

గమనిక: నెం. 3,4 భూమి అడుమానములకు లోబడి యున్నవి. వరకు 2-35 సెంట్లు 2,3 Jdr ల స్వాధీనము యున్న లేటు చిల్లకూరు చంద్రశేఖర రెడ్డి అవిభక్త 1/3 భాగము

DHr Value Rs. 8,000/-

Amine Value Rs.23,500/-

కె. విమల

DHr అడ్వకేటు

## 50 ఏళ్ళ క్రితం

3 పేజీ కొరవ

విధులు కారు ప్రభుత్వపు ఉద్యోగాల వారికే అసహ్యం తోచిందంటె అధికార ప్రాముఖ్యానికి వేరే వ్యాఖ్యానం గావాలనా?

వీరు సలహాదారులు మాత్రమేగాని అధికార కాన్యులు. వీరికి యథార్థ అధికారం వుండాలని స్వా స్టైట్సుమను పత్రిక నిర్మొగమాటంగా చెబుతున్నది.

ప్రధాని చర్చిల్ పూర్వం వైస్ రాయికున్న అధికారం హిట్లరు, ముసోలినిలకే లేదని వ్రాసివున్నారు.

## జనవాణి

(3 పేజీ కొరవ)

కృషి అపూర్వం. దురదృష్టవశాత్తు కూలిపోయినా, కామాక్షమ్మ వారధి శీనయ్య చలవే. నెల్లూరు టౌన్ అభివృద్ధికి అప్పటి ముఖ్యమంత్రి ఎన్.టి.రామారావును ఒప్పించి అధిక నిధులను రాబట్టిన ఘనుడు కూడా శీనయ్యే. కోవూరు, కోట, వెంకటగిరి అభివృద్ధి పట్ల శీనయ్య కున్న ప్రత్యేక శ్రద్ధ గూర్చి చెప్పడానికి అక్షరాలు చాలవు.

నెల్లూరు - సి.ఎం.కృష్ణ

### సమ్మోహన పరచిన మన్‌మోహనుని బడ్జెట్.

కేంద్ర ఆర్థిక మంత్రి మన్ మోహన్ సింగ్ బడ్జెట్ ప్రవేశ పెట్టబోతున్నారన్న వార్త విని సామాన్య ప్రజలు హడలి పోయారు. ధరలను పెంచి ప్రజలను ఎక్కడ రాచిరంపాన పెడతారోనని ఊహించారు. కాని దానికి భిన్నంగా మన్ మోహన్ సింగ్ ప్రవేశ పెట్టిన బడ్జెట్ సమ్మోహన పరచింది. సామాన్యునికి పెద్దగా ప్రయోజనం కల్గించే అంశాలపై కరుణ చూపక పోయినా, మధ్యతరగతి వాళ్ళను ఊహల్లో విహరింప జేసారు. అందరికి అందుబాటులో వుండవలసిన కాఫీ, టీ, ఇతరాలపై పన్ను రద్దు చేయడం శుభ సూచకం.

-గునపాటి వేణుగోపాల్.

నెల్లూరు.

### దేవాలయానికి ఎంతటి దుస్థితి కల్పించారు.

శ్రీ వేదగిరి లక్ష్మీ నృసింహస్వామి వారి దేవస్థానం కరెంటు బిల్లులు కట్టలేని స్థితిలో పడి దాతల దగ్గరనుండి చాలని వసూలు చేసి కట్టారని ఒక పత్రికలో చదివి ఆశ్చర్యపోయాను. ఈ దేవాలయం ఇంతటి దుస్థితికి దిగజారి పోవడానికి పాలకులే కారణం. ఒకప్పుడు ఎంతో ఆస్తి గల దేవాలయం, దానితో ఎన్నో అభివృద్ధి కార్యక్రమాలు చేపట్టారు. తిక్కవరపు దయాకర్ రెడ్డి చైర్మన్ గా వున్నప్పుడు కొండమీదికి కరెంటు వేయించి, మోటారు బిగించి కొళాయిల్లో నీళ్ళు వచ్చేలా చేసారు. తర్వాత దువ్వూరు చంద్ర శేఖర్ రెడ్డి గాలిగోపురం రిపేరుతో పాటు కళ్యాణ మండపం, కాటేజీలు, వాటర్ ట్యాంకులు ఏర్పాటు చేయించారు. ఇపుడు పని చేస్తున్న అధికారులు సరిగా విధులు నిర్వహించక వారివారి స్వంత పనుల్లో నిమగ్నమై దేవాలయానికి ఈ స్థితి కల్పించారు. కొండ క్రింద వున్న కోనేళ్ళ కట్టడం రాళ్ళు, మెట్లకు కట్టిన రాళ్ళు, క్వారీలో రాళ్ళు పట్టుకెళ్ళి పోతున్నా అడిగే నాథుడే లేడు. పాలకవర్గం వుదాసీనతను ఏమనాలో అర్థం కావడంలేదు.

-పొన్నాల రామసుబ్బారెడ్డి,

నెల్లూరు

### ఆత్మకూరు బస్టాండులో వసతులు కల్పించండి

ఆత్మకూరు బస్టాండు బొగ్గు బస్సులు నడుస్తున్నప్పటినుంచి వున్నట్లు గుర్తు. కాని ఆ బస్టాండులో అప్పటికీ, ఇప్పటికీ పెద్ద మార్పులేవీ సంభవించ లేదు. ఆ బస్టాండును చూస్తుంటే కొంత ప్రాంతాల్లోని పల్లెటూరు గుర్తొస్తుంటుంది. ఎక్కడ చూసినా జనమే. మంచినీటి ట్యాంకు వుంది కాని, దానిలో నీళ్ళు రావు. ఆ పరిసర ప్రాంతాన్ని చూస్తే రోత వస్తుంది. ఏదో కాంప్లెక్స్ పేరుతో మరుగుదొడ్లు వున్నాయి. వారికి డబ్బులు గుంజడమేకాని అవి పరిశుభ్రంగా వుంచాలన్న ఆలోచనే లేదు. కాల్వ దుర్వాసనకు ముక్కులు పట్టుకొని నడవాల్సిందే. సాయంత్రమైతే చీకటి, లైట్లు వెలగవు. దానికి తోడు గుంటా మిట్టలతో నిండిన ప్రదేశమవడం వల్ల ప్రయాణీకులు పడే బాధ వర్ణనాతీతం. మునిసిపాలిటీ - ఆర్టీసీ వివాదంలో బస్టాండ్ అభివృద్ధి పూజ్యం. స్పెషల్ ఆఫీసరైన కలెక్టర్ అయినా ఈ బస్టాండ్ గూర్చి పట్టించుకొంటే బాగుంటుంది.

నెల్లూరు -ఎం.కృష్ణయ్య.

### వైద్యాధికారిని నియమించాలి.

కావలి ప్రభుత్వ ఆసుపత్రి లో వైద్యాధికారిని బదిలీ చేశాక, ఇంతవరకు మరో వైద్యాధికారి నియామకం జరుగలేదు. గతంలో వైద్యాధికారి శస్త్రచికిత్స నిపుణులు (ఎం.ఎస్) గా వుండేవారు. ఈ ఆసుపత్రికి రైల్వేశాఖ వారు ఇటీవల ఇ.సి.జి యంత్రాన్ని కూడా బహూకరించి వున్నారు. ఇక్కడ ఒక ఎం.ఎస్. మరో ఎం.డి. డాక్టర్లను నియమించాలి.

- కె.సుజాతానాగరాజారావు.

కావలి.

**In the Court of Motor Accidents Claims tribunal : Nellore**

OP 600/92

Shaik. Masthan and others - Petitioners

Vs

J. Pannerselvam and another - Respondents

To, R1

J. Panner Selvam,
S/o. Not Known
Door No. 15/801,
Jamesgarden, NELLORE

పై నెంబరున పిటీషనర్లు నష్ట పరిహారము కొరకు పై కోర్టులో OP దాఖలు చేసినందుకు మీకు నోటీసు నిమిత్తము 8.4.93 తేది న వాయిదా వేసియున్నారు. మీకు గల ఆక్షేపణలు ఆ రోజు కోర్టుకు హాజరై ఉదయం 10.30 గంటలకు తెల్పుకొనవలెను. లేని యెడల మీ పరోక్షమందు ఎక్స్‌పార్టీగా తీర్మానించబడును.

వి.వి. నరసింహాచార్యులు

పిటీషనర్ల అడ్వకేటు

## కంటి చికిత్స

(4 పేజీ కొరవ)

పిల్లలలో అధిక సంఖ్యాకులు పేద కుటుంబాలకు చెందిన వారే అయివుండడం గమనార్హం. వీరికి తగినన్ని ప్రొటీన్లు, కెలరీలు కల్గిన ఆహారం అవ్వడం, విటమిన్ 'ఎ' ఇంజక్షన్ చేయడం, మాత్రలు ప్రయోగించడం ద్వారా వ్యాధి నయం చేయవచ్చు.

### కంటి మార్పిడి

నల్లగుడ్డు మసక బారిన రోగులకు చికిత్స చేసే ప్రక్రియలలో ఆపరేషన్ ఒకటి. చెడిపోయిన నల్లగుడ్డు ను (opaque carnea) సరిచేసి పారదర్శకత్వాన్ని పునరుద్ధరించడం ద్వారా అంధత్వ లోపం నుంచి విముక్తి కల్పించవచ్చు. నూతన గుడ్డు మార్పిడి ద్వారానూ చూపు కల్పించవచ్చు. జంతువుల టిష్యూలు, గాజుపరికరాలతో కార్నియాకు ప్రత్యామ్నాయం కల్పించడానికి శాస్త్రవేత్తలు ఎన్నో ప్రయత్నాలు చేశారు. కాని అవేవి సత్ఫలితాలనివ్వ లేదు. చెడి పోయిన నల్లగుడ్డు స్థానం లో మరొక ఆరోగ్యకరమైన నల్లగుడ్డు అమర్చడం ద్వారా మాత్రమే ఈ సమస్య పరిష్కార మవుతుందని పరిశోధనలు నిరూపించాయి. చేతి గడియారం పై వుండే అద్దం పై గీతలు పడితే మార్చి కొత్తది వేసుకున్నట్లు నల్లగుడ్డు మారుస్తారు. ఈ మార్పిడి ప్రయత్నాలు 70నుంచి 80 శాతం వరకు విజయవంత మవుతున్నాయి. కంటి ఆరోగ్యం, మార్పిడికి ఎంపిక చేసిన నల్లగుడ్డు పరిస్థితి, నాణ్యత, తాజాదనం, మార్పిడి చేసే డాక్టర్ నైపుణ్యం, ఆపరేషన్ చేసిన తర్వాత తీసుకునే జాగ్రత్తలను బట్టి ఈ మార్పిడి ప్రయోగాల విజయం ఆధారపడి వుంటుంది.

నల్లగుడ్డు మార్పిడి ప్రయోగాలకు నూట యాభై సంవత్సరాల సుదీర్ఘ చరిత్ర వుంది. 1837 లో ఒక ఐరిష్ డాక్టరు ఒక దుప్పి కంటిని తీసి, వేరొక దుప్పికి అమర్చారు. 10 రోజులలోనే ఆ దుప్పికి చూపు కల్గింది. ఈ వార్త తెలిసి, 1844 లో డాక్టర్ రిచర్డ్ కిస్సామ్ అనే అమెరికన్ డాక్టరు ఒక పంది కంటిని ఒక యువకుడికి అమర్చాడు. అయితే దురదృష్టవ శాత్తు ఆ మార్చిన నల్లగుడ్డు కూడా మసక బారింది. దీనితో ఒక జంతువుకు చెందిన కనుగుడ్డు మరొక జంతువుకు మార్చినా, మనుషులకు అమర్చినా పని చేయదని అర్థమై పోయింది.

తర్వాత కృత్రిమ పరికరాలతో ఎన్నో ప్రయోగాలు చేశారు. 1853 లో బంగారు, వెండి, రాగి, గాజు వంటి పదార్థాలతో ఒక డాక్టరు కొన్ని ప్రయోగాలు చేశారు. కాని అవేవి ఫలించలేదు. పైగా ఇన్‌ఫెక్షన్‌తో మరిన్ని సమస్య లెదురైనాయి. ఈ వైఫల్యాల ఆధారంగా పరిశోధన జరిపిన ఆర్థర్ వాన్ హిప్పిల్ అనే శాస్త్రవేత్త లామెల్లార్ టెక్నిక్‌తో పాక్షికంగా నల్లగుడ్డు మార్పిడిని కనిపెట్టారు. తర్వాత తర్వాత జరిగిన పరిశోధనలలో యాంటన్ ఎల్చింగ్ (Anton Elgching) అనే శాస్త్రవేత్త పూర్తిగా నల్లగుడ్డు మార్పిడి చేసే ప్రక్రియ కనిపెట్టారు. ఈ విజయంతో ఎన్నో సంవత్సరాల వైఫల్యాలు, ఆటంకాలు, నిరాశా నిస్పృహలు తొలగి పోయి భవిష్యత్తు పై ఆశ కల్గింది.

ఈ ప్రక్రియను తర్వాత కాలంలో డాక్టర్లు చాలా మెరుగులు దిద్దారు. ఆపరేషన్‌లో నైపుణ్యం, సాంకేతిక పరిజ్ఞానం అభివృద్ధి, సున్నితమైన పరికరాలు కనుగొన బడడం, యాంటి బయాటిక్స్ మందుల ఉత్పత్తి వంటి వాటివల్ల నల్లగుడ్డు మార్పిడి ఇప్పుడు చాలా సాధారణమైన ప్రక్రియగా రూపాంతరం చెందింది. మనిషి శరీరం నుంచి వేరు చేసిన సజీవ కార్నియా (నల్లగుడ్డు) ను సురక్షితంగా భద్రపరిచే విధానం కనిపెట్టడంతో ఈ రంగంలో విప్లవం వచ్చినట్లయింది. ఈ నూతన పరిశోధనే కాల క్రమంలో నేత్రదానం, కంటి బ్యాంకులకు దారితీసింది.

### నేత్రదానం

ఒకరి కన్ను మరొకరికి దానం చేయడం ద్వారా చీకటి బ్రతుకులలో వెలుగులు నింపవచ్చని రుజువైనా, కళ్లు ఎక్కడ నుంచి సేకరించాలి? ఎవరు ఇస్తారు? మన దేశంలో ఏటా 30 వేల మందికి కొత్తగా నల్లగుడ్డు చెడి పోవడం వల్ల అంధత్వం సంక్రమిస్తున్నా, సంవత్సరానికి 4500 మందికి మాత్రమే కంటి మార్పిడి చికిత్స చేసే అవకాశం కల్గుతున్నది. దేశంలోని 26 లక్షల మంది గుడ్డి వారికి చూపు ప్రసాదించాలంటే ఈ లెక్కలో యుగాలు పడ్తుంది? నేత్రదానం పట్ల సరైన అవగాహన, ప్రచారం లేక పోవడమే ఈ పరిస్థితికి కారణం. భారత దేశంలో కంటి మార్పిడిని సులభంగా నిర్వహించగల నిపుణులైన డాక్టర్లు సాంకేతిక నిపుణులు వున్నారు. కాని లేని దల్లా కళ్లే! అందువల్లే నేత్రదానం అన్ని దానాలలోకి పరమ పవిత్రమైన దానంగా పరిగణింప బడుతున్నది.

ఎన్నిట్లో వెనుకబడి వున్నా, గ్రుడ్డి వాళ్ళ సంఖ్యలో మాత్రం భారతదేశం ఎంతో ముందు మిగిలి వుంది. అదే ప్రపంచ అంధుల జనాభాలో నాలుగవ వంతు మన దేశంలోనే వున్నారని అంచనా. ఈ రోజుకీరోజు లెక్కస్తే, కోటి 20 లక్షల మంది భారతీయులు అంధులుగా తేల్తారు. ప్రతి వెయ్యి మందిలో 15 మంది గ్రుడ్డి వాళ్లే; ప్రపంచ సగటు అంధుల సంఖ్య వెయ్యికి మూడు మాత్రమే. దీన్ని బట్టి అర్థం చేసుకోవచ్చు నేత్ర వ్యాధుల పరంగా మనం ఎంత వెనుకబడి వున్నామో!

ఒక రకంగా విచారకరమూ, మరొక రకంగా ఆశావహము అయిన విషయమే మిటంటే - భారతదేశంలో అంధత్వానికి దారితీస్తున్న వ్యాధులలో అధిక భాగం నివారించ దగినవి.

దెబ్బతిన్న కళ్ల రూపాలు

1) దెబ్బతిన్న కన్ను. 2) ట్రోఫిన్ ద్వారా తెల్ల మచ్చ తొలగించుట. 3) దాతలు బహూకరించే కన్ను. 4) ఆపరేషన్ చేసి అతికించడం. 5) మామూలు కన్ను.

చికిత్సతో నయం చేయగల్గినవి. లభ్యమౌతున్న సాంకేతిక పరిజ్ఞానం పుష్కలంగా వినియోగించినా ఎంతో మంది అంధుల జీవితాలలో వెలుగు ప్రసరింపే వీలు లభిస్తుంది. ఆరోగ్యావసరాల పై అవగాహన లేక పోవడం, సరైన పోషకాహారం లభించక పోవడమే అధిక శాతం అంధత్వానికి కారణం. ఇప్పుడున్న కోటి 20 లక్షల మంది అంధులలో కోటి 3 లక్షల మందికి స్వల్పమైన ఆపరేషన్ ప్రక్రియ ద్వారా కంటి చూపు ప్రసాదించవచ్చు; అయినా వీరిలో కొన్ని లక్షల మందికి చికిత్స లభ్యం కావడం లేదు. దురదృష్టకరమైన విషయమిది.

(కొరవ పై వారం)



## జయప్రద

(9 పేజీ కొరవ)

"ఇప్పుడంతా యువ హీరోలే కదా?"

"ఐతే ఏం? హిందీలో ధర్మేంద్ర సరసన నటించిన నేను మరో హిందీ చిత్రంలో ఆయన కొడుకు సన్నీడియోల్ కు హీరోయిన్ గా నటించాను. దీనికేమంటారు? నేను ఒక బిడ్డకు తల్లి అయ్యాక కూడా నటిస్తాను."

"అలాంటి గుడ్ న్యూస్ ఏదైనా.....?"

"ఒక ఏడాది పోయాక చూద్దాం లెండి. ఇప్పుడు నేను షూటింగులతో బిజీగా ఉన్నాను కదా?" అందామె నవ్వుతూ.

ఈమెతో ఈమె భర్త శ్రీకాంత్ సహా కన్నడంలో నిర్మించిన చిత్రం కూడా అంతంత మాత్రంగానే ఆడింది.

Edited, Printed and Published by N. Dolendra Prasad at Zamin Ryot Press, Nellore OFFSET Printing at Nayagara Books (Pvt) Ltd.